# మరణ రహస్యము




రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

## శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

www.thraithashakam.org







# మరణ రహస్యము

రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

## శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు




ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము-40 నాల్గవ ముద్రణ : మార్చి-2018

ప్రతులు : 1000 వెల : **70/-**





# యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక రచనలు



## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దెయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

26) తీర్పు-దేవుని తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మ పత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర
41) భావము-భాష
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.

76) నాది లోచన-నీది ఆలోచన
77) ధ్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు)
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) ఏది సత్యము-ఏది అసత్యము.
90) ఒక వ్యక్తి రెండు కోణములు.
91) అంతిమ దైవగ్రంథములో వజ్రవాక్యములు.
92) బ్రహ్మ-రావణ బ్రహ్మ-భగవాన్ రావణ బ్రహ్మ.
93) ద్వితీయ దైవగ్రంథములో రత్న వాక్యములు.
94) హిందూ ధర్మములో రక్షణ అవసరమా?
95) వేదములు మనిషికి అవసరమా?
96) ఉపనిషత్తులలో లోపాలు.
97) సుప్రసిద్ధి బోధ.
98) రూపము మారిన గీత.
99) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
100) సున్న.
101) ఉగ్రవాదము స్వర్గము కొరకే.

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక ప్రసంగములు

*(DVD'S)*



01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు-అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
05. మాయకుడు-అమాయకుడు.
06. తల్లి తండ్రి-గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం-దేహం మోహం.
11. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
15. మాయ మర్మము- ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం-లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము-మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం- తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం- రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు-కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

## యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక ప్రసంగములు



*(DVD'S)*

27. ఆత్మ.
28. తాత.
29. తల్లి.
30. భయం.
31. ఆత్మపని.
32. బట్టతల.
33. యాదవ్.
34. జ్ఞానశక్తి.
35. సమాధి.
36. 6–3=6.
37. సంతకము.
38. ప్రభు–ప్రజ.
39. త్రైతశకము.
40. తోలేవాడు.
41. తల్లి తండ్రి.
42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ.
44. గురు చిహ్నం.
45. ఆస్తి–దోస్తి.
46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము.
48. దైవగ్రంథము.
49. భక్తి–శ్రద్ధలు.
50. పురుషోత్తమ.
51. మతద్వేషము.
52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ.
54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు.
56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి.
58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు–గురు.
60. దశ–దిశలు.
61. మాట–మందు.
52. సృష్టి–సృష్టికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి–వికృతి.
66. పైత్యం–సైత్యం.
67. నైజం–సహజం.
68. భక్తి–భయము.
69. సాంప్రదాయము.
70. అదురు–బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము–శివము.
73. శైవము–వైష్ణవము.
74. ధర్మము–అధర్మము.
75. ద్రావిడులు–ఆర్యులు.
76. కాయ–పండు–కాయ.
77. యుగము–యోగము.
78. దేవునికి మతమున్నదా?
79. కర్మ మర్మము.

80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.
82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.
88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.
106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము-మోసము.
125. అక్షర జ్ఞానము.
126. లలా జలము.
127. దైవ ధర్మములు-మత సాంప్రదాయములు
128. ఆహారము నీకా! నీ ఆత్మకా!!
129. మాత్ర-మందు.
130. కాలచక్రం.
131. బ్రహ్మవిద్య.
132. శక్తి.
133. పౌర్ణమి-అమావాస్య.
134. ఈశ్వర-పరమేశ్వర.
135. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా





### ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

---

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ** (సూర్య మీ సేవా)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

**డి. వరుణ్ కుమార్ శ్రేష్ఠి** (ప్రెసిడెంట్)
పులివెందుల , కడప (జిల్లా).
Cell : 9293199539, 9985714382

P.M.H **నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

P. **రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, కోయిలకుంట్ల (మం),
కర్నూలు (జిల్లా) Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్) MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
దర్గామాన్యం, గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి** (ప్రెసిడెంట్)
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు** (టీచర్) (ప్రెసిడెంట్)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా





**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హోస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 527 3436, +1(210) 668 8963

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# మరణ రహస్యము

మరణము అనగా చనిపోవడము అని అందరికీ తెలుసు. చావు పుట్టుకలు ప్రతి జీవికీ కలవు. పుట్టుకతో జీవికి జీవితము మొదలగును. మరణముతో జీవితము అంతమగును. జీవుని యొక్క పుట్టుక చావుల మధ్య కాలమును జీవితము అంటాము. ఒక జీవునికి పుట్టుక కావాలంటే ఒక శరీరముండి తీరాలి. అలాగే జీవునికి మరణము రావాలన్నా వానికి శరీరముండి తీరాలి. క్రొత్త శిశు శరీరమున్నపుడు ఆ శరీరములోనికి జీవుడు చేరడమును జన్మ లేక జననము అంటున్నాము. ఇది అందరికీ తెలిసిన విషయమువలె కనిపించినా, శరీర పరిశోధకులకు కూడా తెలియని రహస్యమున్నది, అదియే **జనన రహస్యము.** ఇంతవరకు తెలియని జనన రహస్యమును సిద్ధాంత రూపములో గ్రంథరూపముగా తెలియజేశాము. మేము తెలియజేసిన **"జనన మరణ సిద్ధాంతము"** విజ్ఞానరంగములో (సైన్సులో) ఒక మలుపులాంటిది. మనిషికి తెలియని జననమును గురించి, అట్లే మనిషికి తెలియని మరణమును గురించి జనన మరణ సిద్ధాంతములో విజ్ఞానరూపములో విపులముగా తెలియజేశాము. ఇపుడు ముఖ్యముగా చెప్పునదేమనగా! జననము గడచి పోయినది. తర్వాత రావలసినది మరణము. అందువలన రాబోవు మరణమును గురించి తెలుసుకోవడము మనిషికి ముఖ్య అవసరము. అయితే మరణమును గురించి కూడ మరణ సిద్ధాంతములో తెలియజేశాము. అంతేకాక మరికొన్ని గ్రంథములలో కూడా మరణము రెండు రకములున్నదనీ, ఒకటి కాలమరణమనీ, రెండవది అకాల మరణమనీ కూడా తెలియజేశాము. దీనివలన మనిషికి జన్మ ఒక రకమేననీ, మరణము రెండు రకములనీ తెలిసిపోయినది. మేము తెలియజేసినది శాస్త్రబద్ధమైన సమాచారము, కావున ఎవరూ ఖండించుటకు వీలులేదు. మేము ముందుగానే ఇది భౌతికశాస్త్రవేత్తలకు కూడా తెలియని సమాచారమని

చెప్పాము. మాకు తెలియనిదా అని ఎవరైనా మేము చెప్పిన విషయమును ఖండించాలని చూచినా, మాది శాస్త్రసమ్మతమైన సిద్ధాంతము కావున దానిని ఎవరూ ఖండించలేరు.

ఇపుడు ప్రత్యేకించి చెప్పునది ఏమనగా! మరణము **కాల, అకాల** అని రెండు రకములుగా ఉండినా, మూడవ రకమైన మరణము కూడ ఒకటి గలదు. మూడవ రకము వాస్తవానికి మా లెక్కలో మరణము కాకున్నా, ప్రజల లెక్కలో మరణమే! కావున దానిని కూడా మూడవ మరణముగా చెప్పవలసివచ్చినది. ఇంతవరకు సైన్సు తెలిసిన వారికి **కాల మరణమును** గురించే తెలుసు. రెండవ రకమైన **అకాల మరణము**ను గురించి కూడా ఏమాత్రము తెలియదు. మూడవదైన **తాత్కాలిక మరణము**ను గురించి ఇప్పటి కాలములో, నూటికి నూరుపాళ్ళు ఎవరికీ తెలియదనే చెప్పవచ్చును. ఇప్పటి కాలములో మూడవరకమైన తాత్కాలిక మరణమును గురించి ఎవరికీ తెలియక పోయినా, పూర్వకాలము కొందరికి దీనివిషయము తెలియుననుటకు కొన్ని ఆధారములున్నవి. ఆ ఆధారములను తర్వాత చెప్పుకొందాము. ఇప్పుడు మరణము అనునది కర్మకు సంబంధించినదా? లేక కర్మకు అతీతమైనదా? అని చాలామంది ఆధ్యాత్మికవేత్తలను అడిగితే కర్మను బట్టియే మరణమూ, కర్మను బట్టియే జననమూ అని చెప్పుచున్నారు. ఈ ప్రశ్నకు మేము చెప్పు జవాబు ఏమనగా! మనిషికిగానీ, జంతువుకిగానీ, జీవము గల ఏ ప్రాణికి గానీ జనన మరణములు సహజ సిద్ధమైనవి మాత్రమే. జనన మరణములు జీవరాసులకు ప్రకృతి సిద్ధమైనవిగా ఉన్నవి. చావుపుట్టుకలు కర్మకు అతీతమైనవి. వారి వారి కర్మనుబట్టి చనిపోయే సమయమూ, చనిపోవు స్థలమూ, చనిపోవునప్పుడు జీవన పరిస్థితీ, చనిపోవు సమయములో ఉండవలసిన ఆరోగ్య, అనారోగ్యమూ,

శరీర బలమూ, శరీర వయస్సూ నిర్ణయింపబడి ఉండును. అయితే చావుగానీ, పుట్టుకగానీ కర్మకు సంబంధము లేని ప్రకృతి సిద్ధమైన ప్రక్రియలు. కేవలము మరణమును గురించి చెప్పుకొన్నచో, మరణము జీవునికి ఏ అనుభూతి లేని స్థితి. అందువలన అనుభవము లేనిదానిని కర్మకు అంటగట్టకూడదు. అనుభవమునకు వచ్చునది ఏదైనా కర్మకు సంబంధించినదే అగును. మరణము అనుభవములేనిది. కావున కర్మకు అతీతమైనది. జీవునికి జన్మ కల్గిన తర్వాత ప్రారబ్ధకర్మ మొదలగును. అలాగే జీవునికి ప్రారబ్ధకర్మ అయిపోయిన తర్వాత మరణముకల్గును. అందువలన జనన మరణములు రెండూ కర్మకు అతీతమైనవేనని చెప్పుచున్నాము.

## మరణమంటే ఏమిటి?

ఒక జీవుని జీవితము ముగిస్తే దానిని చచ్చిపోవడము లేక మరణించడము అంటాము. వీటిలో **చచ్చిపోవడము** అను పదమును పూర్వము **సత్తు పోవడము** అనిగానీ, **సత్తు పోయింది** అనిగానీ చెప్పెడివారు. కాలక్రమములో అజ్ఞానము పెరిగిపోయి, సత్తు అను పదమునకు అర్థము తెలియకుండా పోయి, సత్తు పోయింది అని పల్కుటకు బదులు, చచ్చి పోయింది అని పల్కుచున్నారు. అలాగే సత్తు పోవడమును చచ్చిపోవడము అని కూడా అంటున్నాము. మరణము అను పదము మాత్రము పూర్వము నుండి మార్పు చెందక ఒకే విధముగా పలుకబడుచున్నది. ఇప్పుడు మార్పు చెందివున్న, చచ్చిపోవడమను పదము గురించి వివరించుకొని చూస్తాము. బ్రతికిన మనిషి శరీరములో రెండు ఆత్మలు ఉండడము సహజము. ఇది ఒక మనిషి శరీరములోనే కాక, జీవమున్న ఏ జాతి శరీరములోగానీ రెండు

ఆత్మలు ఉండడము సిద్ధాంతము. ఇంకా వివరముగా చెప్పుకొంటే యోగశాస్త్రము (బ్రహ్మవిద్యాశాస్త్రము) ప్రకారము సజీవ శరీరములో మూడు ఆత్మలుండుట సహజము. అందులో ఒక ఆత్మ ఉలకదు, పలకదు, పని చేయదు, తటస్థముగ ఉండునది మాత్రమే. అందువలన మనము ఇప్పుడు చెప్పుకోవలసినది రెండు ఆత్మలను గురించి మాత్రమే. జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అనబడు మూడు ఆత్మలలో పరమాత్మ ఏ పనినీ చేయదు మరియు ఉండడము తప్ప దేనికీ పనికి రాదు. ఇక శరీరములో మిగిలిన ఆత్మ, జీవాత్మ అను రెండు ఆత్మలు మాత్రమే పనిని చేయునవిగా ఉన్నవి. శరీరములోని జీవాత్మయే నేను ఫలానా అని చెప్పుకొనుచున్నది మరియు 'నేను' అను భావము కల్గి శరీరములోని కష్ట సుఖములను అనుభవించు చున్నది. అంతమాత్రము తప్ప శరీరములోని జీవునికి ఏ పనియు లేదు. ఇకపోతే శరీరములోని ప్రతి పనినీ ఆత్మ చేయుచున్నది. ఇక్కడ ముఖ్యముగా చెప్పవలసిన విషయమేమంటే **శరీరములో జీవుడను తాను తప్ప ఆత్మ ఒకటున్నదనిగానీ, వ్రాయడము, చేయడము, మాట్లాడడము, పోట్లాడడము, చూడడము, ఆడడము సమస్త పనులన్నీ ఆత్మ చేయుచున్నదనిగానీ ఎవరికీ తెలియదు.** శరీరములో మంచి చెడు పనులు చేయుచున్నది ఆత్మేనని తెలియక, అందరూ తామే అన్నీ చేయుచున్నామని అనుకొంటున్నారు.

ఎవరికి తెలిసినా, ఎవరికి తెలియకున్నా శరీరములో ముఖ్యపాత్రను పోషించునది ఆత్మయే. శరీరములో జీవాత్మ ఉంటే ఆత్మ తప్పనిసరిగ ఉంటుంది. అందువలన జీవాత్మకు, ఆత్మ జోడుఆత్మ అనియూ, ప్రక్కనే ఉండుట వలన పొరుగు ఆత్మ లేక పొరుగువాడనియూ, శరీరములో అన్ని అవయవములకు శక్తినిచ్చుట వలన సత్తువ లేక సత్తు అనికూడా ఆత్మ పిలువబడుచున్నది. చనిపోయినపుడు శరీరములోని కదిలెడి సత్తువ

అంతయు పోవుట వలన అనగా ఆత్మ పోవుట వలన సత్తు పోయింది అని పూర్వము ఆధ్యాత్మికవేత్తలనెడివారు. పూర్వము ఆత్మను అధ్యయనము చేసిన ఆధ్యాత్మికవేత్తలు శరీరములోని జీవున్ని లెక్కించక, ఆత్మనే ముఖ్యముగ పరిగణించినవారై, మరణించిన మనిషిని చూచి ఫలానా వాని సత్తు పోయింది లేక ఫలానావాడు సత్తు పోయాడు అనెడివారు. అలాగే ఆవు మరణిస్తే దానిని చూచి ఆవు సత్తు పోయింది అనెడివారు. ఇప్పటి కాలములో ఆత్మజ్ఞానము తెలియని మనుషులు **సత్తు** అను పదమును **సచ్చు** అని పలుకుచు చివరికి ఆవు సచ్చిపోయింది, కుక్క సచ్చిపోయింది, మనిషి సచ్చిపోయాడు అంటున్నారు. పలకడములో సచ్చిపోయాడు అని అనుచూ, వ్రాయడములో చచ్చిపోయాడు అని వ్రాస్తున్నారు. ఈ విధముగా భావము లోనూ, భాషలోనూ అజ్ఞానముగా శబ్దమునూ, పదమునూ అజ్ఞానులు మార్చివేశారు. అందువలన సచ్చిపోయాడు అను పదమును మార్పుచెందిన మాటగ చెప్పుచున్నాము.

ఇక మార్పుచెందని **మరణము** అను మాటను గురించి వివరించు కొందాము. ఈ పదములో 'మర' అను శబ్దమున్నది "మర" అనగా నాశనము చేయునదని అర్థము. "రణము" అనగా యుద్ధము అని అర్థము. మర+రణము=మరణము. మరణము అను శబ్దములో నాశనము చేయు యుద్ధమని అర్థము గలదు. శరీరము నాశనమగుటకు జరుగు క్రియ మొదలగుటను మరణము అంటున్నాము. జీవుడు మరియు ఆత్మ శరీరమును వదలిన వెంటనే శరీరములోని ధాతువులలో యుద్ధములాంటి పని మొదలగును. తొందరగా శరీరము నాశనమగుట మొదలగును. శరీరము జీర్ణించి పోవు క్రియ యుద్ధమువలె తొందరగ జరుగుచున్నదని తెలియుటకు దానిని మరణము అన్నారు. మరణము ముఖ్యముగ రెండు

రకములని ఒకటి కాల మరణమనీ, రెండవది అకాల మరణమనీ తెలుసు కొన్నాము. ఈ రెండు మరణములలోను శరీరము నాశనమై పోవుచున్నది. మానవుని శరీరమును విభజించి చూచితే సూత్రబద్ధముగా 24 భాగములుగా ఉన్నది. జీవునితో అయితే 25 భాగములగును. ఆత్మతో అయితే 26 భాగములగును. జీవుడున్న చోట ఆత్మవుండును. కావున ఆత్మను వదలి జీవున్ని లెక్కించి చూచితే మొత్తము 25 భాగములుగా శరీరమున్నది. శరీరములో ప్రత్యేకమైన పనిని చేయునది ప్రత్యేక భాగము అను సూత్రము ప్రకారము లెక్కించి చూచితే జీవునితో సహా 25 రకముల భాగములు ఏర్పడుచున్నవి. 25 శరీర భాగములలో భౌతికముగా కనిపించు భాగములు 10 మాత్రమున్నవి, అభౌతికముగా కనిపించిన భాగములు 15 గలవు. పైకి కనిపించు శరీర భాగములను స్థూలశరీరమనీ, కనిపించని శరీర భాగములను సూక్ష్మశరీరమనీ అంటున్నాము. ఇపుడు స్థూల శరరీములోని 10 భాగములనూ, సూక్ష్మ శరీరములోని 15 భాగములనూ క్రింద చూస్తాము.

| స్థూల శరీరభాగములు | సూక్ష్మ శరీరభాగములు | |
|---|---|---|
| 1. కన్ను | 1. జీవుడు | 11. వ్యానవాయువు |
| 2. ముక్కు | 2. మనస్సు | 12. సమానవాయువు |
| 3. నాలుక | 3. బుద్ధి | 13. ఉదానవాయువు |
| 4. చెవి | 4. చిత్తము | 14. ప్రాణవాయువు |
| 5. చర్మము | 5. అహము | 15. అపానవాయువు |
| 6. చేతులు | 6. చూపు | |

| | |
|---|---|
| 7. కాళ్ళు | 7. వినికిడి |
| 8. నోరు | 8. స్పర్శ |
| 9. గుదము | 9. రుచి |
| 10. గుహ్యము | 10. వాసన |

ఒక సజీవ శరీరములో 25 భాగములుండుటయే కాక, వాటిని అన్నిటినీ నడుపు ఆత్మ కూడ గలదు. కాల మరణములో స్థూల, సూక్ష్మ శరీర భాగములైన 24 భాగములను వదలి జీవుడు, ఆత్మ వెళ్ళిపోవుదురు. కానీ స్థూల శరీరమును మాత్రము వదిలి సూక్ష్మ శరీరమైన 14 భాగములతో జీవుడు, ఆత్మ కూడ ఉండడమును అకాల మరణము అంటాము. అకాల మరణములో జీవుడు, ఆత్మ మిగత 14 భాగముల సూక్ష్మ శరీరముండుట వలన అది మరణము కాదు. మనుషులకు కనిపించు స్థూలశరీరము పడిపోవుట వలన, బయటికి అది మరణమే అయినా, దానిని అకాల మరణమని చెప్పుచున్నాము. కాల మరణములో జీవుడు, ఆత్మ మరుజన్మకు పోవుదురు. అకాల మరణములో జీవుడు, ఆత్మ మరుజన్మకు పోరు. ఎందుకనగా వారికి సూక్ష్మశరీరమున్నది. కావున సూక్ష్మశరీరములో జీవుడు ఇంకా కొంతకాలము బ్రతకవలసినది ఉన్నది. అటువంటి సూక్ష్మశరీరమున్న వానికి శ్వాస కూడ జరుగుచునే ఉన్నది. స్థూల శరీరము శ్వాస (ప్రాణము) లేనిదై పడిపోవడము వలన, దానిని మరణమే అని అందరూ చెప్పినా, అది పూర్తి మరణము కాదు. శాస్త్రబద్ధమైన మరణమునకు ఒక సిద్ధాంత మున్నది. శ్వాస శరీరము నుండి బయటికి పోయి తిరిగి శరీరములోనికి చేరకపోతే అది మరణమగును. దానినే నూటికి నూరు పాళ్ళు మరణమని చెప్పవచ్చును. శ్వాస సర్వసాధారణ ముగా ఆడుచున్నపుడు స్థూలశరీరమును

వదిలినా అది పూర్తి మరణము కాదు. వాడు కనిపించని శరీరముతోనే బ్రతికే ఉన్నాడు. అందువలన దానిని అకాల మరణమని అంటున్నాము. అకాల మరణమును పొందిన వాడు కనిపించకుండినా వాడు మనతో పాటే బ్రతికి ఉన్నాడని జ్ఞప్తి పెట్టుకోండి.

## తాత్కాలిక మరణము

కాలమరణములో జీవుడు, ఆత్మ శరీరమును వదలిపోయి మరు జన్మకు పోవుచున్నారు. అకాల మరణములో జీవుడు, ఆత్మ సగము శరీరమును వదలి సగము శరీరములో నివసిస్తున్నారు. ఇక మరణము అనుకొని పొరపాటు పడుచున్న తాత్కాలిక మరణమును గురించి వివరించు కొందాము. తాత్కాలిక మరణమను దానిని మూడవ మరణముగా చెప్పవచ్చును. వాస్తవానికి ఇది మరణమే కాకున్నా అలా చెప్పవలసి వచ్చినది. ఈ మూడవ రకమైన మరణములో జీవుడు, ఆత్మ స్థూల శరీరమును గానీ, సూక్ష్మశరీరమును గానీ వదలి వెళ్ళరు. ఈ తాత్కాలిక మరణములో జీవుడు శరీరమును వదలి పోకుండ శరీరములోనే ఉండును. కాల మరణములోను, ఆకాల మరణములోను జీవుడు స్థూల శరీరమును వదలిపోవుట వలన శరీరములోని కదలికలు అన్నీ నిలిచిపోవును. కావున కదలికగానీ, శ్వాసగానీ లేని శరీరమును చూచి వీడు మరణించాడని చెప్పు చున్నాము. అయితే తాత్కాలిక మరణములో జీవుడు శరీరమును వదలి పోకున్ననూ, దానిని మరణమని ఎందుకంటున్నారని కొందరడుగవచ్చును. దానికి జవాబు ఏమనగా! మరణము సిద్ధాంతముతో కూడుకొన్నదైనా ప్రజలు మాత్రము కనిపించుదానినే నమ్ముచున్నారు. ప్రజలకు శరీరములో

శ్వాస ఆడితే మనిషి బ్రతికి ఉన్నట్లూ, శ్వాస ఆడకపోతే మనిషి మరణించినట్లు చెప్పుచున్నారు. చివరి శ్వాసతోనే మరణము వస్తుందను సూత్రము చాలామందికి తెలియదు. ఎప్పుడు శ్వాస నిలిచిపోతే అప్పుడు చివరి శ్వాస పోయినట్లే కదా! అని కూడా అడుగుచున్నారు. మొదటిదైన కాల మరణములో మాత్రము చివరి శ్వాస పోయినట్లు, మనిషి మరణించినట్లు చెప్పవచ్చును. కానీ రెండవదైన అకాల మరణములో కూడ మనిషి యొక్క చివరి శ్వాసను గురించి చెప్పలేము. ఎందుకనగా కనిపించే స్థూల శరీరములో శ్వాస ఆడకపోయినప్పటికీ, కనిపించని సూక్ష్మశరీరములో శ్వాస ఆడుచున్నది. అందువలన అది కూడ మరణము కాదు. ఇకపోతే మూడవదైన తాత్కాలిక మరణములో సిద్ధాంతము ప్రకారము శరీరమును విడచి శ్వాస పోలేదు, కావున దానిని మరణము అనుటకు ఏమాత్రము వీలులేదు. కానీ విశేషమేమంటే శరీరములో శ్వాస ఆడకుండ నిలిచిపోవుట వలన మూడవ దానిని కూడా ప్రజలు మరణము అంటున్నారు.

మరణ సిద్ధాంతము ప్రకారము చివరి శ్వాసతో జీవుడు శరీరమును వదలిపోవునని చెప్పియున్నాము. ఒక్క కాలమరణములో మాత్రమే చివరి శ్వాస కలదు. అకాల మరణములో చివరి శ్వాస అనునది లేకుండ యథా ప్రకారముగా శ్వాస సూక్ష్మశరీరములో ఆడుచున్నది. కావున రెండవ దానిలో చివరి శ్వాసలేదని చెప్పవచ్చును. ఇక మూడవ దానిలో శరీరమందు శ్వాస నిలిచిపోయి మనిషి చనిపోయినట్లు కనిపించినా శ్వాస బయటికి పోలేదు. జీవుడుగానీ, ఆత్మగానీ శరీరమును వదలిపోలేదు. తాత్కాలిక మరణములో లోపలికి పోయిన శ్వాస ఊపిరితిత్తులలోనే నిలిచిపోవును. శ్వాస బయటికి రాకుండ నిలిచిపోయిన దానివలన గుండె నిలిచిపోవు చున్నది. గుండె నిలిచిపోయిన దానివలన రక్తప్రసరణ అంతయు నిలిచి

పోవుచున్నది. రక్తప్రసరణ నిలిచిపోవడము వలన శరీరములోని నాడి కొట్టుకొదు, మెదడునుండి చైతన్యము నిలిచిపోవును. దానివలన శరీరము చలనము లేనిదై, శ్వాస లేనిదై పడిపోవును. అప్పుడది బయటి వారికి మరణమువలె కనిపించినా, మా లెక్కలో సిద్ధాంతము ప్రకారము మరణము కాదు. ఎందుకనగా శరీరములోని జీవుడు బయటికి పోలేదు. శరీరములోని శ్వాస లోపల నిలచిపోయినది తప్ప బయటికి పోలేదు. ఒకవేళ బయటికి పోయి నిలిచిపోయివుంటే అది అతనికి చివరి శ్వాస అయ్యేది. కానీ శ్వాస లోపలే నిలిచిపోయిన దానివలన అది ఆఖరి శ్వాస కూడా కాదు. అందువలన అది మరణము కాదని చెప్పవచ్చును. అటువంటి సమయములో జీవుని స్థితి ఎట్లుండునని, దానిని ఏమని చెప్పవచ్చునని కొందరడుగ వచ్చును. దానికి జవాబు ఏమనగా! ఆ సమయములో జీవుడు నిద్రావస్థ స్థితిని పొందివున్నాడు. కానీ ఆ సమయమున శరీరములో శ్వాస ఆడడము లేదు, కాబట్టి బయటికి అది మరణమువలె కనపించును. వైద్యులు సహితము దానిని మరణమే అంటారు. అందువలన మేము దానికి తాత్కాలిక మరణమని పేరుపెట్టాము.

తాత్కాలిక మరణము కొందరికి కర్మానుసారము వచ్చుచుండును. ఈ మరణమును పొందినవాడు కొద్దిసేపు నిద్రించి లేచినట్లు కొన్ని గంటలకు గానీ, కొన్ని రోజులకుగానీ, కొన్ని నెలలకుగానీ తిరిగి లేవగలడు. అయితే ఆ విషయము ఎవరికీ తెలియదు. కావున తాత్కాలిక మరణమును పొందిన వానిని నిజముగా చనిపోయాడని భ్రమించి వానిని పూడ్చివేయడమో, కాల్చి వేయడమో జరుగుచున్నది. అట్లు చేయడము వలన వానిని బయటికి రాకుండ హత్యచేసినట్లగుచున్నది. తాత్కాలిక మరణము పొందిన వాని శరీరము ఆ జీవుడు శరీరములో ఉన్నంతవరకు చెడిపోదు. శరీరము

చల్లబడి పోయినా, శరీరము రంగు మారిపోయినా, శరీరములో ఏ చలనమూ లేక పోయినా ఆ శరీరము చెడిపోదు. తాత్కాలిక మరణమనునది భూమిమీద జీవరాసి పుట్టినప్పటినుండి ఉన్నది. పూర్వ కాలము కొందరు దానిని గుర్తించారు. కొందరు తాత్కాలిక మరణమును పొంది తిరిగి బ్రతికిన వారు కూడా కలరు. కొందరికి తాత్కాలిక మరణము తెలియకుండా వస్తున్నది. కొందరేమో దానిని తెలిసి పొందువారు కూడా గలరు.

## తాత్కాలిక మరణమా - బ్రహ్మయోగమా?

తాత్కాలిక మరణమును బాగా వివరించి చూచితే అది భగవద్గీతలో చెప్పిన బ్రహ్మయోగములాంటిది. బ్రహ్మయోగములో బాహ్య జ్ఞానేంద్రియ ముల విషయములన్నియు నిలిచిపోయి, శ్వాస స్థంభించిపోయి, గుండె ఆగిపోయివుండును. తాత్కాలిక మరణములో కూడా ఇవే లక్షణములు శరీరమునకుండును. బయటికి బ్రహ్మయోగము, తాత్కాలిక మరణము రెండు ఒకేలాగుండినా లోపల జీవుడు మాత్రము కొంత తేడాతో ఉండును. తాత్కాలిక మరణమును పొందిన జీవుడు మరుపుతో ఉండి పోవును. బ్రహ్మయోగమును పొందిన జీవుడు ఎరుకలో ఉండిపోవును. **మరుపు అనగా నిద్ర, ఎరుక అనగా యోగము.** బ్రహ్మయోగమును పొందిన వాడుగానీ, తాత్కాలిక మరణమును పొందినవాడుగానీ బయటికి కనిపించు టకు ఒకే స్థితిలో ఉందురు. కావున ఎవరు యోగములో ఉన్నారో, ఎవరు మరణములో ఉన్నారో చెప్పలేము. బ్రహ్మయోగము పొందినవాడు గానీ, తాత్కాలిక మరణము పొందినవాడు గానీ తిరిగి ప్రాణముతో లేవగలిగేవారే! కావున ఇద్దరినీ కలిపి తాత్కాలిక మరణము పొందినవారనినా తప్పులేదు.

బ్రహ్మయోగమును కూడా ఒక విధముగా తాత్కాలిక మరణమనియే చెప్పవచ్చును. బ్రహ్మయోగమను తాత్కాలిక మరణమును యోగి అయిన వాడు తెలిసి పొందుచున్నాడు. యోగి కాని సాధారణ మనిషి తనకు తెలియకుండా తాత్కాలిక మరణమును పొందుచున్నాడు. తాత్కాలిక మరణమువలె నుండు బ్రహ్మయోగమును పొందు యోగి ఎంత కాలము తాను యోగములో ఉండాలో నిర్ణయించుకొని బ్రహ్మయోగమును ప్రారంభించును. అలా ఒక ఉద్దేశముతో ప్రారంభించిన యోగికి కొంత సమయము తేడాతో బయటి జ్ఞాపకము వచ్చును. కానీ తనకు తెలియకుండ తాత్కాలిక మరణము పొందిన వానికి ఒక నిర్ణయమంటూ ఉండదు, కావున అతనికి బయటి జ్ఞాపకము ఎప్పుడు వస్తుందో చెప్పలేము. బ్రహ్మయోగి యోగములో కూర్చున్నట్లు, అతను యోగమును ఆచరించు యోగి అయినట్లు, బయటి వారికి తెలిసివుండుట వలన బ్రహ్మయోగి ఎంత కాలము యోగములో కూర్చున్నా ఫరవాలేదు. బయటి మనుషులు అతనిని యోగిగానే చూస్తారు. బ్రహ్మయోగి కానటువంటి సాధారణ మనిషి ఒకవేళ తాత్కాలిక మరణమును పొందితే, అతని శరీరములో శ్వాస ఆగి పోయివుండుట వలన, బయట మనుషులు అతనిని చనిపోయినట్లు లెక్కించి, వానికి అంత్యక్రియలు చేయుదురు.

తాత్కాలిక మరణమును పొందిన వానికి, వాని శరీరములోని అన్ని క్రియలు ఆగిపోవుటకు అతని మెదడులోని శక్తి శరీరమంతటిని వదలి మెదడుయందు మాత్రమే కేంద్రీకృతమైపోవును. బ్రతికియున్న సాధారణ మనిషికి ఆత్మశక్తి శరీరమంతటా వ్యాపించియుండును. తాత్కాలిక మరణమును పొందిన మనిషికి ఆత్మశక్తి తలయందుగల మెదడు మధ్య భాగములో నిలిచిపోవును. సూత్రము ప్రకారము ఆత్మ శరీరములో

ఉన్నంత వరకు జీవాత్మ కూడ శరీరములో ఉంటుంది. ఆత్మ, జీవాత్మ రెండూ జోడు ఆత్మలని చాలామార్లు చెప్పియున్నాము. బ్రతికియున్న శరీరములో ఒక ఆత్మ ఉంది అంటే రెండవ ఆత్మ కూడ ఉండితీరుతుంది. అందువలన మెదడు మధ్య భాగములో ఆత్మ శక్తి నిలిచి పోవుట వలన జీవాత్మ తన స్థానములో తాను ఉంటుంది. అన్నిటికీ శక్తినిచ్చు ఆత్మ తాను మాత్రము శరీరమంతావుండి తన శక్తిని మెదడు మధ్యలో నిలిపివేసి శరీరములోని ఏ భాగమునకూ శక్తినివ్వక పోవడము వలన మనస్సు కూడ పనిచేయదు. మనస్సు పని చేయని దానివలన జీవునికి ఏమీ తెలియక నిద్రస్థితిని పొందియుండును. తాత్కాలిక మరణమును పొందిన జీవుడు తిరిగి బయటి జ్ఞాపకము వచ్చు వరకు నిద్రస్థితిలోనే ఉండిపోవును. బ్రతికివున్న వానికి నిద్రవస్తే కొన్ని గంటలే ఉండును. కానీ తాత్కాలిక మరణములోని నిద్ర కొన్ని రోజులు లేక కొన్ని నెలలుగా ఉండవచ్చును. ఇన్ని రోజులు ఆ విధమైన నిద్రవుంటుదని చెప్పుటకు వీలులేదు. తాత్కాలిక మరణము పొందినవాడు ఎన్ని రోజులు ఆ స్థితిలో ఉండునది వాని ఆత్మ మీద ఆధారపడి ఉండును. అతని ఆత్మ నిర్ణయాన్ని బట్టి తాత్కాలిక మరణ కాలముంటుంది.

మెదడు మధ్య భాగములో నాలుగు చక్రముల సముదాయమునకు ఆత్మ ఇరుసుగా ఉన్నది. నాల్గుచక్రములు అగోచరమైనవి. వాటికి ఆధారమైన ఆత్మ కూడ అగోచరమైనదే. నాలుగుచక్రములయందు క్రింది చక్రములో జీవుడుండును. ఈ నాల్గు చక్రములు తల భాగములో ఉన్నంతవరకు జీవుడు ఆ శరీరమును వదలి పోయే దానికి కాదు. తాత్కాలిక మరణమును పొందిన మనిషికి ఆత్మశక్తి శరీరమునుండి ముకుళించుకొని నాల్గుచక్రముల వద్ద మాత్రము నిలిచిపోవును. ఆత్మశక్తి శరీరమంతా

లేకుండా నాల్గుచక్రముల మధ్యలో నిలిచి పోయినపుడు నాల్గు చక్రములలో క్రింది రెండు చక్రములైన గుణ, కర్మచక్రములు కూడా కదలకుండా నిలిచి పోవును. అందువలన ఆ శరీరములోని గుణములుగానీ, కర్మగానీ ఆచరణకు రాకుండా నిలిచిపోవును. తాత్కాలిక మరణమును పొందిన జీవుడు ఏ గుణమును పొందక, ఏ కర్మను అనుభవించక నిద్రస్థితిలో ఉండిపోవును. ఇదే పరిస్థితి బ్రహ్మయోగములో కూడా కల్గుచున్నది. అయితే అక్కడ మనస్సు ఎరుకలో ఉన్నది. తాత్కాలిక మరణములో మనస్సు కూడ లేనిదానివలన ఆ స్థితిని నిద్రస్థితియే అని చెప్పవచ్చును. నాల్గు చక్రముల సముదాయమును క్రింది పటములో చూడవచ్చును.



కాలమరణములో చివరిగా శ్వాస ఆగిపోయినపుడు శరీరము నుండి బయటికి పోవునవి ఈ నాల్గుచక్రములేనని తెలియవలెను. నాల్గు చక్రములకు ఇరుసుగానున్న ఆత్మయు, క్రింది చక్రములోనున్న జీవాత్మయు, క్రింది చక్రములోనే ఉన్న గుణములు, దాని పై చక్రములోని కర్మములు అన్నియు మరణములో బయటికి పోయి వేరొక శరీరమును చేరి జీవునికి జన్మను పొందునట్లు చేయుచున్నవి. కానీ తాత్కాలిక మరణములో అట్లు జరుగలేదు. తాత్కాలిక మరణము సాధారణ కాలమరణమువలె కనిపించినా అది బ్రహ్మయోగమువలె ఉండునని చెప్పవచ్చును. యోగమువలెనున్న తాత్కాలిక మరణములో మనిషికి కర్మ పోవడము లేదు, అట్లే కర్మరావడము లేదు. బ్రహ్మయోగములోగానీ, తాత్కాలిక మరణములోగానీ బయటికి జరుగు ప్రక్రియ ఏదీ కనిపించదు.

## తాత్కాలిక మరణము జీవరాసులన్నిటికీ కలదా?

మేము ఇంతవరకు చెప్పిన తాత్కాలిక మరణము కొందరికి క్రొత్తగా, కొందరికి వింతగా కనిపించినా, ఈ మరణమును కొందరు మనుషులే కాక ఎన్నో జీవరాసులు కూడ పొందినవని తెలియుచున్నది. కొన్ని ప్రాంతములలో చిన్నచిన్న జీవరాసులు తాత్కాలిక మరణమును ఒకమారు పొందడమే కాక, ఒకటికంటే ఎక్కువమార్లు పొందినవి కూడా కలవు. తాత్కాలిక మరణమును పొందిన వాటిలో కప్పలు, చిన్నచిన్న మిడత జాతులు ఎన్నో కలవని చెప్పవచ్చును. కొన్ని కప్పలను భూమిలోతులో సమాధి చేసినట్లు భూమిని త్రవ్వనపుడు కొందరు చూచివుందురు. పది, పదిహేను, ఇరవై అడుగుల లోతులో కూడ కప్పగూడును చూడడము జరిగినది. ఇరవై

లేక ముప్పది అడుగుల లోతులో త్రవ్వినపుడు బయటపడు కప్పను గురించి అది అంత లోతులో ఎలా బ్రతుక గలిగింది? ఎంత కాలమునుండి ఉన్నది? అంతవరకు దానికి ఆహారము ఎలా దొరికింది? అన్న ప్రశ్నలు అడిగితే ఎంతో విజ్ఞానము గల శాస్త్రవేత్తలు కూడ దానికి జవాబులు చెప్పలేక ఇవి వివరించలేని రహస్యములు (UN EXPLAINED MYSTERIES) అని వదలివేశారు. దానిని గురించి మేము ఏమి చెప్పుచున్నామంటే, భూమి లోతుల్లోనుండి బయటపడిన కప్ప భూమిలో అంతవరకు తాత్కాలిక మరణము పొందివున్నదనీ, ఆ కప్ప ఏదో ఒక కాలములో, ఏదో ఒక సంఘటనలో భూమిలో కూరుకపోయినదనీ, అది బయటపడినపుడు తిరిగి మెలుకువ వచ్చి కదలుచున్నదనీ, ఆ విధముగ కొన్ని వేలు, కొన్ని లక్షల సంవత్సరములనుండి అది అలా ఉండగలిగినదని చెప్పుచున్నాము. అలా ఉండుటకు సాధ్యమా? అని కొందరికి అనుమానము రావచ్చును. దానికి మా జవాబు ఏమనగా!

తాత్కాలిక మరణమును పొందిన ఏ జీవరాసికి కానీ, మానవునికి గానీ ఇంత కాలమను నిర్ణయముండదని ముందే చెప్పాము. కప్ప విషయానికి వస్తే కప్ప తలలోని నాలుగు చక్రములను నడుపు ఆత్మ, కప్ప మట్టిలో పూడి పోయినపుడు దానిని తాత్కాలిక మరణమును పొందునట్లు చేసినది. మట్టిలో చిక్కుకొని పోయిన కప్ప మొదట తాత్కాలిక మరణమును పొందక మునుపే తన చుట్టువున్న మట్టిని తన నాలుకతో నాకీ, కొంత మట్టిని తినీ, తన చుట్టు ఏమీలేకుండా, తాను నలిగిపోకుండా చిన్న గూడు మాదిరి చేసుకుంటుంది. తన చుట్టు కొంత సందువుండునట్లు చేసుకొని నిలిచి పోతుంది. అలా నిలిచిపోయిన తర్వాత అది తాత్కాలిక మరణమును పొందుతుంది. తర్వాత అది నిద్రస్థితినే పొందినది, కానీ బ్రతికినస్థితిని

కాదు. కదలిక లేకుండ నిలిచిపోయిన కప్ప శరీరములోని ఆత్మ, ఆ శరీరములోని పనులన్నిటిని ఆపివేయడము వలన, ఆ కప్ప అలాగే పెరగకుండ నిలిచి పోయినది. మట్టిలో కూరుకపోయిన దినము కప్ప ఎంత లావు (సైజు) ఉందో, కొన్ని వేల సంవత్సరముల తర్వాత బయట పడినప్పుడు కూడా అదే లావు (సైజు)లో ఉండును. ఆ దినము ఎంత వయస్సున్నదో, అంతే వయస్సు బయటపడిన దినముండును. మట్టిలో కూరుకపోయిన దినము ఏ జాతి కప్పగా ఉంటుందో, బయట పడిన దినము కూడ అదే జాతి కప్పగ ఉండును. కొన్ని చోట్ల పూర్వముండి ప్రస్తుత కాలములో ఆ ప్రాంతములోలేని జాతికప్పలు బయటపడినవి, దానికి కారణము ఆ జాతి ఇప్పుడు లేకున్నా పూర్వముండెడిదని అర్థమగుచున్నది. అలాగే రంగులో తేడావున్నవీ, ఆకారములో తేడావున్నవీ త్రవ్వునపుడు బయట పడడము చూచాము. దానినిబట్టి ప్రస్తుత కాలములో లేని జాతి, పూర్వము ఎప్పుడో ఉండేదనీ, అప్పటినుండి ఉన్న కప్ప ఇప్పుడు బయట పడిందనీ అర్థమగుచున్నది.

శ్వాస కోశము పని చేయకున్నా, గుండె కొట్టుకోక పోయినా, ఒక జీవి శరీరముతో ఎంతకాలమైనా సజీవముగా ఉంటుందా? అను ప్రశ్న ప్రతి ఒక్కరికీ రాగలదు. దానికి సమాధానము ఇలా ఉంది. ఈ విషయము భౌతికశాస్త్రము ద్వారా తెలియదు. భౌతికశాస్త్రము కనిపించెడి భౌతిక శరీరమునకు సంబంధించినది మాత్రమే. అందువలన భౌతికశాస్త్రవేత్తలు ఈ విషయమును ఎటూ తేల్చలేరు. తాత్కాలిక మరణము భౌతికశాస్త్రమునకు అంతుబట్టని విషయముగ ఉన్నది. దానివలన ఈ విషయమును వివరించ లేని రహస్యము అన్నారు. ప్రతి విషయమునకు శాస్త్రబద్ధత ఉండాలి. అప్పుడైతే దాని వాస్తవికత తెలియును. బయటికి మరణించి ఎంత

కాలమైనా, జీవించు విషయములోని వాస్తవము తెలియాలంటే బ్రహ్మవిద్యా శాస్త్రమును చూడవలసిందే. బ్రహ్మవిద్యా శాస్త్రము ఆరు శాస్త్రములలో పెద్దది. బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము శరీరములోని ఆత్మకు శరీరము మీద సర్వ అధికారము ఉండును. జీవుడు మాత్రము శరీరములో ఏ హక్కు లేనివాడుగా ఉన్నాడు. ఆత్మ ఒక్కటే ఇటు శరీరమును, అటు జీవాత్మను శాసించి నడిపించగలదు. కప్ప శరీరములో కూడా ఆత్మవున్నది. కప్ప శరీరము మీద అధికారముగల ఆత్మ, నాల్గుచక్రములను నిలిపివేసి దాని జీవిత వ్యవస్థను ఆపివేసింది. కప్ప శరీరములోని జీవున్ని నాల్గవచక్రమైన గుణచక్రములో నిలిపి వేసింది. కప్ప శరీరములోని వేడినీ, కదలికలనూ అన్నిటిని తనలో అణచివేసింది. అవసరమొచ్చినపుడు శరీరమునకు కదలికలనూ, వేడినీ ఆత్మే ఇవ్వగలదు. ఆత్మ నాల్గుచక్రములను కదలకుండ ఎంతకాలమైన నిలిపివేయగలదు. తర్వాత ఎప్పుడు చక్రములను కదలునట్లు చేస్తే అప్పుడు వెన్నుపాము (బ్రహ్మ నాడి) ద్వారా చైతన్యము శరీరములోనికి ప్రాకి శరీరము కదలగలదు. అప్పుడే శరీరములోనికి వేడి కూడ ప్రాకగలదు. అంతవరకు నిలిచి పోయిన రక్తప్రసరణ తిరిగి ప్రారంభమై గుండె కొట్టుకోగలదు. అప్పుడు జీవుడు నిద్రనుండి లేచినట్లు జాగ్రత్తావస్థలోనికి వచ్చును. అంతవరకు ఎంతకాలము జరిగినది జీవునకుగానీ, మనస్సుకు గానీ, బుద్ధికిగానీ తెలియదు. నిద్రపోయి లేచినట్లు జీవునికి తెలియును, కానీ గడచిన కాలము ఎంత అని తెలియదు. తాను మరణమును పొంది లేచినట్లు ఏ అనుభూతి ఉండదు. ఈ విధముగా బ్రహ్మవిద్యా శాస్త్ర ప్రమాణముగా మనకు తెలియని తాత్కాలిక మరణమున్నదని తెలియు చున్నది. దీనిని శాస్త్రబద్ధత లేని విషయముగా ఎవరూ లెక్కించకూడదు.

# ఏసు మరణము ఎలాంటిదో తెలుసా?

క్రైస్తవ మతకర్త ఏసుప్రభువు శిలువ మీద మరణించాడని అందరూ చెప్పగా విన్నాము. అయితే నేనడుగునదేమనగా! ఆయన కాలమరణము పొందాడా? అకాలమరణము పొందాడా? తాత్కాలిక మరణము పొందాడా? అంటున్నాను. ఏసుప్రభువు మరణమునకు మూడు ప్రశ్నలున్నాయని బహుశ ఎవరూ అనుకొని ఉండరు. వారి మతములోని ఏ బోధకుడుగానీ ఆయన మరణమును గురించి యోచించి ఉండరనుకుంటాను. అయితే మేము చెప్పునదేమనగా! ఏసుప్రభువుది కాలమరణము కాదు, అకాల మరణము కాదు. ఆయన తాత్కాలిక మరణమును పొందాడు. ఏసు తాను చనిపోయినట్లు అక్కడున్న అందరికి తెలియునట్లు చనిపోయాడు. ఏసు చనిపోయినట్లు నిర్ధారించుటకు, ఒక సైనికుడు శిలువ మీద తలవంచి చనిపోయిన ప్రభువు యొక్క డొక్కలోనికి ఈటెతో పొడిచాడు, అలా పొడిచినపుడు ఏసు ఏమాత్రము చలనములేని వాడైనట్లూ, ఆయన చనిపోయినట్లూ నిర్ధారణ అయింది. అ విధముగా ఆయన చనిపోయాడని తెలిసిన తర్వాత ఆయన శవమును ఇతరులకు అప్పగించారు. అక్కడ జరిగిన వింత ఏమిటంటే, ఆయన చనిపోయాడనుటకు నిరూపణ దొరికింది. మా మాట ప్రకారం ఆయన అందరివలె చనిపోలేదు అనుటకూ నిరూపణ దొరికింది. ఆయన చనిపోయాడనుటకు ఈటెతో పొడిచినపుడు అతనిలో చలనము లేదు. బ్రతికివుంటే కొద్దిగా అయినా కదిలేవాడు లేక మూలిగే వాడు, కానీ అలా జరుగలేదు, కనుక బయట ప్రజల లెక్కలో ఆయన నిజముగా చనిపోయినట్లే. బయట ప్రజల లెక్కప్రకారము ఆయన చనిపోలేదు అనే దానికి కూడా ఆధారము గలదు. చనిపోయిన వ్యక్తి శరీరములో

రక్తము గడ్డకట్టి పోతుంది. కానీ ఒక సైనికుడు ఈటెతో ఆయన ప్రక్కలో పొడిచినపుడు గాయమునుండి రక్తము కారినట్లు తెలిసింది. అలా రక్తము నీళ్ళుగ కారింది అంటే బయట ప్రజల దృష్టిలో చనిపోలేదని అనుమానము రాకతప్పదు. ఆ విధముగ ఏసు ప్రభువు యొక్క మరణము పట్ల ప్రజలలో, ఆయన మరణించాడనీ, మరణించలేదనీ రెండు రకముల అనుమానములు వచ్చునట్లు జరిగినది. వాస్తవానికి అక్కడ ఏమి జరిగినదని యోచిస్తే ఇలా తెలియుచున్నది.

ఏసుప్రభువు చనిపోవునపుడు (యోహాను సువార్త 19 అధ్యాయము 30వ వచనములో) **"సమాప్తమైనదని చెప్పి తలవంచి ఆత్మను అప్పగించెను"** అని వ్రాసివుంది. (లూకా 23వ అధ్యాయము 46వ వాక్యము) **"తండ్రీ నీ చేతికి నా ఆత్మను అప్పగించుకొనుచున్నాననెను. ఆయన ఇలాగు చెప్పి ప్రాణము విడిచెను"** ఈ రెండు వాక్యములలో ఏసు చివరిలో చెప్పిన మాటను బాగా వివరించి చూచితే ఈ విధముగా అర్థము కాగలదు. ఏసుకు తన శరీరములో తానుగాక మరొకరు తనకు అధిపతిగా ఉన్నాడని తెలియును. మన శరీరములో నేను తప్ప ఎవరూ లేరు అని మనిషి అనుకుంటాడు. కానీ దైవజ్ఞానము సంపూర్ణముగా తెలిసిన ఏసుప్రభువు తన శరీరములో తనకు పెద్దగా ఉన్నవాడు తనకు దైవముగా ఉన్నవాడు, తనకు పొరుగు వానిగా ఉన్నవాడు, తనకు అధిపతిగా ఉండి తనను నడిపించువాడు మరొకడున్నాడని పూర్తి తెలిసినవాడై, చివరిలో శిలువ మీద నా ఆత్మను నీకు అప్పగించుచున్నానని చెప్పాడు. ఏసు ఆత్మ జీవాత్మకాగా, ఆయనకు అధిపతిగావున్నది రెండవ ఆత్మ. ఏసుప్రభువు యొక్క శరీరమును రెండవ ఆత్మయే నడిపించుచున్నది. ఆయనకే కాదు మన శరీరములలో కూడ మన ఆత్మను (జీవాత్మను) రెండవ ఆత్మయే నడిపించుచున్నది. శరీరములోని

మనము ఒకటవ ఆత్మకాగా, మన శరీరమును నడిపించునది రెండవ ఆత్మని తెలియవలెను. ఈ పద్ధతి సర్వ జీవరాసులకు వర్తించు సిద్ధాంతమని కూడ తెలియవలెను. జ్ఞానియైన వాడు ఎవడైనా నేను దేనికీ కర్తనుకాను, అన్నిటికీ నా రెండవ ఆత్మయే కర్త అని తెలిసివుండును. ఏసు మహా జ్ఞాని అయినందున చివరిలో మరణము ఆసన్నమైనపుడు కూడా నా ఆత్మను నీకు అర్పిస్తున్నాను, నీవు ఏమి చేయదలచుకుంటావో నీ ఇష్టము ప్రకారము అదే చేయి అని పూర్తి దాసోహమన్నాడు. **ప్రతి మనిషి ప్రతి విషయము లోను ఆ విధముగా ఉండవలెననీ, తన్నుతాను కర్తగ ఎవ్వడూ పోల్చు కోకూడదనీ, గొప్ప జ్ఞాన సందేశాన్ని ఏసు చివరిలో కూడ ప్రజలకు తెలియజేశాడు.**

ఏసు ఆ విధముగ చెప్పిన తర్వాత ఆయన శరీరములో వ్యాపించి యున్న ఆత్మశక్తి శరీరమునుండి వెన్నుపామును (బ్రహ్మనాడిని) చేరి, అక్కడినుండి శిరస్సు మధ్య భాగములో చేరిపోయినది. ఆ సమయములో శరీరములోని అంతర్గత కార్యములన్నియు నిలిచిపోయి, బయటికి మరణించిన శరీరముతో సమానముగా తయారైనది. లోపలి ఆత్మ ఎలా అనుకుంటే అలా జరుగును. ఎందుకనగా మొత్తము శరీరమునకు ఆత్మయే అధిపతి, అధికారి. స్థంభించి పోయిన ఏసు శరీరములోని రక్తమును గడ్డకట్టకుండ ఉండునట్లు అత్మయే చేసినది. అందువలన సైనికుడు ఏసు శరీరమును బల్లెముతో పొడిచినపుడు గాయమునుండి రక్తము కారినది. రక్తము గడ్డకట్టని దానివలన ఏసు మరణించలేదను అనుమానము వచ్చునట్లు ఆత్మయే చేసినది. అలాగే ఏసు శరీరము స్థంభించి పోయి, శ్వాస కూడా ఆడకుండుట వలన ఏసు చనిపోయాడని నమ్మునట్లు ఆత్మే చేసినది. ఆ విధముగ రెండు రకములు కనిపించినపుడు, ఏసు మరణమును

గురించి యోచించి అందులోని రహస్యమును తెలుసుకుంటారని, ఆత్మ ఆ విధముగ చేయడము జరిగినది. అయితే ప్రజలు దానిలోని అంతరార్థమును ఏమాత్రము గమనించకుండ, కొందరు క్రైస్తవులు కానివారు “ఏసు శిలువ మీద మరణించ లేదు, ఆయన మరణించినట్లు నటించాడు. అప్పుడు ఆయన చనిపోయాడని అందరూ నమ్మి ఏసును సమాధిలో ఉంచారు. సమాధిలో ఒకరోజు విశ్రాంతి తీసుకొని ఏసు తిరిగి లేచి వచ్చాడు. అంతేకానీ ఆయన మరణమును జయించి లేచిరాలేదు. ఆయన మరణమును జయించి వచ్చిన వాడుగా క్రైస్తవులు చెప్పుకోవడము అసత్యము. క్రైస్తవులు తమ ప్రభువును మరణము జయించిన దేవునిగా చెప్పుకోవడము వారి మత ప్రచారమునకే గానీ ప్రభువు చనిపోలేదు, తిరిగి బ్రతకలేదు” అంటున్నారు.

వాస్తవముగ ప్రభువు చనిపోలేదా? అని మమ్ములనడిగితే, ఆయన శరీరములో అన్నీ స్థంభించిపోయి, శ్వాస ఆడకుండ, గుండె కదలకుండ పోయినప్పుడు, భౌతిక సూత్రము ప్రకారము ఏసు మరణించాడనియే చెప్పవచ్చును. వాస్తవానికి ఏసు ఆ సమయములో మరణించాడనీ, ఆ మాటలో అసత్యము ఏమీ లేదని మేము కూడా చెప్పుచున్నాము. మేము గ్రుడ్డిగ ఏ విషయమునూ మాట్లాడదలచుకోలేదు. మేము చెప్పు మాటలు అన్నియు శాస్త్రబద్ధముగ ఉండవలెనని అనుకుంటాము. నిష్పక్ష పాతముగ, శాస్త్రసమ్మతముగ సత్యమునే చెప్పవలసి వస్తే ఒక పద్ధతి ప్రకారము చూస్తే భౌతిక శాస్త్ర సూత్రము ప్రకారము చనిపోయిన వ్యక్తికి రక్తము గడ్డకట్టి పోకుండా నీరుగా ఉండదు. కాబట్టి అతను చనిపోలేదని చెప్పవచ్చును. రెండవ పద్ధతిగా చూస్తే అదే భౌతిక శాస్త్రము ప్రకారము శరీరములో గుండె ఆగిపోయి, శ్వాస నిలిచిపోయిన వ్యక్తిని చనిపోయాడని చెప్పవచ్చును.

దీనినిబట్టి క్రైస్తవులు ఏసు చనిపోయాడని చెప్పు మాట నిజమే! అలాగే ఇతరులు ఏసు చనిపోలేదని చెప్పుమాట నిజమే!! పరస్పర విరుద్ధమైన సంఘటన శాస్త్రబద్ధమెలా అవుతుంది అని ఎవరైనా ఇక్కడ ప్రశ్నించవచ్చును. శాస్త్రములో పరస్పర విరుద్ధ సూత్రములుండవు. అందువలన ఏసు ప్రభువు యొక్క మరణమును గురించిన సత్యము తెలియాలంటే, ఆయన మరణమును షట్ (ఆరు) శాస్త్రములలో ఏ శాస్త్రమును అనుసరించి చూడాలో ముందు తెలుసుకోవాలి. అలా తెలుసుకొంటే ఆయన మరణ విషయములో భౌతిక శాస్త్రమును ఆధారము చేసుకొని చూడకూడదని తెలియుచున్నది. కేవలము కనిపించే శరీరము వరకే అయితే భౌతికశాస్త్రము పనికి వస్తుంది. కానీ ఇక్కడ కనిపించని జీవాత్మ, ఆత్మ విషయము కూడా ఉన్నది. కావున ఆయన మరణమును ఆరవ శాస్త్రమైన బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము చూడాలి. బ్రహ్మవిద్యాశాస్త్ర ప్రకారమైతేనే మరణ విషయము అర్థమవుతుంది.

బ్రహ్మవిద్య అనగా పెద్దవిద్య అని అర్థము. బ్రహ్మ అనగా పెద్ద అని అర్థము, బ్రహ్మవిద్యాశాస్త్రము అనగా పెద్దవిద్యాశాస్త్రము అని అర్థము. భూమిమీద మనకున్నవి కేవలము ఆరు శాస్త్రములేనని జ్ఞప్తికుంచుకోవలెను. 1) గణిత శాస్త్రము 2) ఖగోళ శాస్త్రము 3) రసాయన శాస్త్రము 4) భౌతిక శాస్త్రము 5) జ్యోతిష్య శాస్త్రము 6) బ్రహ్మవిద్యా శాస్త్రము. ఇవి తప్ప శాస్త్రములు లేవు. ఈ ఆరు శాస్త్రములకు అనుసంధాన శాస్త్రములుండ వచ్చును. కానీ షట్ శాస్త్రములు తప్ప భూమిమీద ఎక్కువ శాస్త్రములు లేవు. ఉన్నాయంటే అవి శాస్త్రములు కావు. వృక్ష శాస్త్రమున్నది కదా అని ఎవరైనా అడిగితే అది భౌతిక శాస్త్రమునకు సంబంధించినదేనని చెప్పండి. ఇప్పుడు అసలు విషయానికి వస్తాము. బ్రహ్మవిద్యా శాస్త్రమైన భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగము అను అధ్యాయమునందు ఎనిమిదవ శ్లోకము

శ్లో॥ 8. శరీరం య దవాప్నోతి యచ్చా ప్యుత్క్రామతీశ్వరః ।
గృహీ త్వైతాని సంయాతి వాయుర్గన్ధాని వాశయాత్ ॥

పై శ్లోకములోని సారాంశము ఏమనగా! **"ఒక జీవుడు శరీరమును వదలి పోవాలన్నపుడు, వానితోపాటు వానికి అధిపతి లేక ఈశ్వరుడుగానున్న ఆత్మ నాల్గుచక్రముల చట్రములోని జీవున్నీ, గుణములనూ, కర్మనూ తీసుకొని గాలిలో సువాసన కంటికి కనిపించకుండ పోయినట్లు, ఎవరికి తెలియకుండా వేరొక శరీరమునకు పోవుచున్నది."**

పై శ్లోకము యొక్క ప్రమాణము ప్రకారము శరీరమునకు అధిపతిగ నున్న ఆత్మ తనతోపాటు జీవున్నీ, కర్మలనూ, గుణములను తీసుకొని పోవడమును మరణము అంటాము. ఒక్కమారు ఆత్మ శరీరమును వదలిపోతే అది ముమ్మాటికీ మరణమగును. ఒక్కమారు మరణిస్తే ఆ శరీరములోనికి తిరిగి ఆత్మ చేరదు. ఇది శాస్త్రబద్ధమైన సూత్రము. శరీరమును ఆత్మ వదిలితే తిరిగి క్రొత్త శరీరములో ప్రవేశించును, కానీ పాతశరీరములో ప్రవేశించుట నిషేధము, ఇది శాస్త్రము, అందులోను పెద్ద శాస్త్రము యొక్క సూత్రము, కావున ఎప్పటికీ మారునదికాదు, ఏసుప్రభువు శరీరములోని ఆత్మ శరీరమును వదలిపోలేదు. కావున దానిని కాలమరణ మని అనకూడదు. ఏసు శరీరములోని కదలికలన్నీ బ్రహ్మనాడి లోని ఆత్మయందు అణిగిపోయాయి. ఆత్మ చైతన్యము ఆయన తల భాగములో నిలిచివున్నది, కావున ఆయన తాత్కాలిక మరణమును పొందాడు. కానీ మరణమును పొందలేదు. తాత్కాలిక మరణము బయటికి మనిషి చనిపోయినట్లువుండును. కావున ఏసు చనిపోయాడని అందరూ అన్నారు. భౌతిక శాస్త్రము ప్రకారము కొందరు "రక్తము గడ్డకట్టలేదు కావున ఆయన

బ్రతికివున్నాడని” అన్నారు. ఇక్కడ భౌతిక శాస్త్రముతో సమస్య పరిష్కారము కాదు. ఇది ఆత్మకు సంబంధించిన చావు, బ్రతుకుల విషయము. కావున బ్రహ్మవిద్యా శాస్త్రముతోనే పరిష్కరించాలి. **బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము ఏసు నిద్రావస్థలోనికి పోయి తాత్కాలిక మరణము చెందుట వలన బయటికి చనిపోయినట్లే, లోపలికి బ్రతికియున్నట్లే లెక్కించబడును.**

తలలోనే అణిగియున్న ఆత్మ రక్తమును కూడ గడ్డకట్టిపోవునట్లు చేయగలదు. కానీ ఏసు మరణముతో మరణ విషయములో ప్రజలకు కనువిప్పు కలగాలనీ, తాత్కాలిక మరణమును గురించి అర్థము కావాలనీ, ఏసు ఆత్మ ఆ విధముగ చేసినది. దీనితో ఏసు మరణము ప్రజలను అవుననీ, కాదనీ సందిగ్ధములో పడివేసినది. అయినప్పటికీ దానిని గురించి ఎవరూ యోచించి శాస్త్రబద్ధముగ జవాబును చెప్పలేకపోయారు.

ఏసు చనిపోయాడని నిర్ధారించుకొన్న తర్వాత, శిలువ మీదినుండి ఆయన శరీరమును దించి సమాధిలో ఉంచడము జరిగినది. సమాధి అనగా మట్టిలో పూడ్చినది కాదు. రాతిగుహను ఆనాడు సమాధి అన్నారు. ఏసు శరీరమును రాతిగుహలో ఉంచి, ఆ గుహ ద్వారమునకు ఒక రాయిని అడ్డముగా పెట్టడము జరిగింది. ఏసును శుక్రవారము ఉదయము 9 గంటలకు శిలువ వేయగా, ఆయన మధ్యాహ్నము మూడుగంటలకు చనిపోగా, సాయంకాలమునకు ఆయనను రాతిగుహలో పెట్టి మూసివేశారు. శని వారమంతయు ఏసు నిద్రావస్థలోనే ఉండిపోయాడు. ఆదివారము సూర్యోదయమునకు ముందే ఏసు దేహములోని ఆత్మ తనశక్తిని శరీరమంతా ప్రాకునట్లు చేసింది. అప్పుడు ఏసు శరీరములోని గుండె కదిలి పని చేయగా రక్తప్రసరణము, శ్వాస ఆడుటకు మొదలు పెట్టాయి. ఆ

సమయములో ఏసుకు నిద్రనుండి జ్ఞాపకము వచ్చునట్లు ఆయన ఆత్మ చేయగా, ఏసు లేచి కూర్చొని తాను శిలువ మీద కొరత వేయబడిన తర్వాత నిద్రలోనికి పోయినట్లు అర్థము చేసుకొన్నాడు. ఏసు శనివారము అంతయు సమాధిలో నిద్రయందున్నాడు. కనుక ఆ దినమును విశ్రాంతి దినము అన్నారు. తాను బ్రతికే ఉన్నట్లు తన శిష్యులకు తెలుపాలని ముందుగా తన శిష్యులవద్దకు బయలుదేరాడు. మొదట మగ్దలేన మరియతో మాట్లాడి, తర్వాత పోయి తన శిష్యులతో కలిసాడు. శిష్యులు ఆయనను చూచి దయ్యమని అనుమానించగా, **"కాదు. నేను మొదటినుండి వున్న మీ ఏసునేనని"** చెప్పి వారికి సాక్ష్యముగా తన శరీరము మీద ఉన్న గాయములను కూడ చూపెను. దానితో అక్కడికి వచ్చినది శిలువ మీద ములుకులు కొట్టగా గాయపడిన తమ ఏసుప్రభువేనని ఆయన శిష్యులు గుర్తుపట్టారు. ఆయన శరీరము మీద గాయము గుర్తులు శిలువ ఎక్కిన శరీరమే అనుటకు ఆధారముగా ఉన్నవి. **దీనివలన ఏసు శిలువ మీద మరణించినా, అది అందరికీ తెలిసిన కాలమరణమూ కాదనీ, ఎవరికీ తెలియకున్న అకాల మరణమూ కాదనీ, ఇంతవరకూ ఎవరి ఊహకూ అందకుండా రహస్యముగ నున్న తాత్కాలిక మరణమని తెలిసిపోయినది.**

## తాత్కాలిక మరణములు ఇంకా ఎవరికైనా ఉన్నాయా?

తాత్కాలిక మరణము వాటివాటి కర్మను బట్టి మిగత జీవరాసులకు కూడ ఉన్నది. పుట్టిన ప్రతి జీవరాసికి కాలమరణము తప్పనిసరిగ ఉంటుంది. అకాల మరణము ఉండవచ్చు, ఉండకపోవచ్చును. అలాగే

తాత్కాలిక మరణమనునది తప్పనిసరిగా ఉంటుందని చెప్పలేము. కర్మను బట్టి అన్నీ ఉంటాయి. కావున అటువంటి కర్మవుంటే ఏ జీవరాసికైనా తాత్కాలిక మరణము తప్పదు. దీని విషయములో కొందరు ఎంత చెప్పినా నమ్మకపోవచ్చును. అటువంటి వారు కూడ ఇది నిజము అని తెలుసు కొనునట్లు, కొన్ని రకములైన కీటకములకు తప్పనిసరిగ తాత్కాలిక మరణముండునట్లు కర్మ అమరిక ఉన్నది. (Cryogenic Bugsicles) అను పేరుగల ఒకరకమైన మిడుతలాంటి కీటకము మంచుప్రాంతములో జీవితమును సాగించుచూ, మంచులేని కాలములో మాత్రము తన జీవితమును సాఫీగా సాగించుచుండును. మంచు ఎక్కువైన చలికాలము, మంచులో నిలిచిపోయి చనిపోతుంది. అలా చనిపోయిన కీటకము మీద మంచు పేరుకొని పోయి మంచులో సమాధియై పోతుంది. అలా దాదాపు ఆరు నెలల కాలముంటుంది. తర్వాత వాతావరణము మారిపోయి మంచు కరిగిపోయినపుడు ఆ కీటకము బయటికి కనిపిస్తుంది. అలా కనిపించిన కీటకము తిరిగి ప్రాణము పోసుకొని ఎగిరి పోవడము, తన జీవితమును తిరిగి సాగించడము జరుగుచున్నది. ఇది ప్రతి సంవత్సరము ప్రత్యక్షముగ జరుగుచున్న కార్యము. దీనిని (N.G) టీవీ ఛానల్ చూపించింది. ఏసు ప్రభువు మూడవరోజు లేచాడు అంటే నమ్మలేని వారు కూడా, ఈ కీటకము చనిపోయి తిరిగి ఆరు నెలలకు లేస్తుందంటే తప్పనిసరిగ నమ్మితీరవసిందే. తాత్కాలిక మరణము ఎన్నో జీవరాసులకు కలిగినప్పటికీ వాటిని గుర్తించు టకు వీలులేదు. అటువంటి వాటిని సహజ మరణమే అనుకుంటాము. అయితే తాత్కాలిక మరణమంటూ ఒకటున్నదని అందరికీ తెలియునట్లు ప్రకృతిలో ఆరు నెలలు చనిపోయి, ఆరు నెలలు జీవించు కీటకము తయారు చేయబడినది. దానిని చూచిన తర్వాత ఎవరైనా తాత్కాలిక మరణమంటూ

ఒకటున్నదని ఒప్పుకోక తప్పదు. తాత్కాలిక మరణము ఎన్ని రోజులు ఉంటుంది అనుటకు ఖచ్చితమైన జవాబులేదు. ఎందుకనగా తాత్కాలిక మరణము వారి వారి కర్మనుబట్టి అప్పటికప్పుడు నిర్ణయింపబడునది. కావున ఏసుప్రభువుకు మూడు రోజులున్నది. ఇతరులకు కర్మను బట్టి 30 రోజులైన ఉండవచ్చును, మూడు గంటలైనా ఉండవచ్చును.

## తాత్కాలిక మరణమును గతములో ఎవరైనా గుర్తించారా?

తాత్కాలిక మరణము సృష్టి తయారైనప్పటినుండి ఉన్నది. కొందరు ఆధ్యాత్మికవేత్తలు దానిని గుర్తించగలిగారు. 100 సంవత్సరముల పూర్వము తమిళనాడు రాష్ట్రములోని కుంభకోణమునందు మాస్టర్ C.V.V రామన్ అను పేరుగల ఒక ఆధ్మాత్మికవేత్త ఉండెడివాడు. ఆయన ఆ ప్రాంతములో అప్పటి కాలములో పెద్ద గురువుగా పేరుగాంచిన వాడు. ఆయన శిష్యులైన కొత్త రామకోటయ్య, సంగమేశ్వరరావు అను ఇద్దరు శిష్యులు "బృక్త రహిత తారక రాజయోగము" అను గ్రంథములో 13వ పేజీలో, 1911వ సంవత్సరమునందు జరిగిన ఒక సంఘటనను గురించి వ్రాశారు. ఒక దినము C.V.V రామన్‌గారు అత్యవసర పని మీద ప్రయాణమై పోవు సమయములో, ఆయన దత్తు తల్లి అయిన కంచుపట్టి సుబ్బమ్మగారు, కావేరీ నదికి స్నానానికి పోయి వచ్చు సమయములో క్రిందపడి చనిపోయిందట. ఆమె మరణ విషయమును తెలిసిన C.V.V రామన్‌గారు తాను తిరిగి వచ్చేంత వరకు ఆమె శరీరమునకు చీమలు పట్టకుండ జాగ్రత్తగ ఇంటిలోనే ఉంచుకోమని చెప్పాడట. అప్పుడు ఇంటిలోని వారు అలాగే సుబ్బమ్మగారి

శరీరమును జాగ్రత్తగా పెట్టడము జరిగింది. తర్వాత 16 దినములకు C.V.V వెంకట రామన్ గారు వచ్చిన తర్వాత ఆమెను బ్రతికించడము జరిగిందట. అప్పటికి ఆమె వయస్సు 80 సంవత్సరములు కాగా, తిరిగి ఆమె బ్రతికిన తర్వాత మూడు సంవత్సరములు జీవించడము జరిగింది. 80 సంవత్సరముల తల్లిని బ్రతికించిన C.V.V రామన్ గారు, 30 సంవత్సరముల అల్లుడు చనిపోతే ఆయనను బ్రతికించలేదు. దీనినిబట్టి తన తల్లి పూర్తి చనిపోలేదనీ, ఆమె తాత్కాలిక మరణమును పొందినదని తెలిసిన C.V.V రామన్‌గారు తన తల్లిని బ్రతికించుకొన్నాడనీ తెలియుచున్నది. దీనివలన రామన్‌గారు అప్పటి కాలములోనే కాలమరణమునూ, తాత్కాలిక మరణమునూ గుర్తించగలిగాడని అర్థమగుచున్నది.

పై విషయము వంద సంవత్సరముల క్రిందటిది కాగా, 5200 సంవత్సరముల క్రిందట శ్రీకృష్ణుని సమక్షములో జరిగిన విషయమును కూడా ప్రస్తావించుకొందాము. శ్రీకృష్ణునికి బాల్యములో ప్రపంచ విద్యలను నేర్పిన గురువు సాందీపుడు. సాందీపుని కుమారుడు చిన్న వయస్సులోనే చనిపోగా సాందీపుడు చాలా రోదించాడు. గురువుగారైన సాందీపుని ఓదార్చుటకు పోయిన శ్రీకృష్ణుడు గురువుగారి బాధను చూడలేక చనిపోయిన బాలున్ని తిరిగి బ్రతికించాడని చరిత్రలో గలదు. వంద సంవత్సరముల పూర్వము మాస్టర్ సి.వి.వి గారు వారి దత్తు తల్లిని బ్రతికించినా, 5200 సం॥ పూర్వము శ్రీకృష్ణుడు తన గురువుగారైన సాందీపుని కుమారున్ని బ్రతికించినా, ఆ రెండు మరణములు కాలమరణములు కావనీ, అవి తాత్కాలిక మరణములనీ మనకు అర్థమగుచున్నది. కాలమరణమును పొందినవాడు తిరిగి బ్రతుకుటకు వీలులేదని ముందే చెప్పుకొన్నాము. ఒకమారు చనిపోయిన వాడు తిరిగి తానుగా బ్రతికినా, లేక ఇతరుల చేత

బ్రతికించబడినా, వారు పొందినది తాత్కాలిక మరణమని తెలిసిపోవు చున్నది. తాత్కాలిక మరణమును పొందిన వానిని ఎవరైనా బ్రతికించారంటే, వారికి చనిపోయినవాడు తాత్కాలిక మరణము పొందినాడని ముందే తెలిసి వుంటుంది. వారు చనిపోయిన వారిది తాత్కాలిక మరణమని ఎలా తెలుసుకోగలిగారో వివరించి చెప్పుటకు నాకు కూడా తెలియదు. వారు ఎలా తెలుసుకొన్నారో చెప్పుటకు నావద్ద ఆధారమైన జవాబులేదు. వారు ఎలా తెలుసుకొన్నారనునది ఇక్కడ ప్రశ్నకాదు. వారికి తాత్కాలిక మరణమును గురించి తెలిసింది అని చెప్పవచ్చును.

గతములో తాత్కాలిక మరణమును గురించి తెలిసినవారూ, కొందరు చనిపోయినవారూ గొప్ప ఆధ్యాత్మికవేత్తలను మాట వాస్తవము. అంత గొప్పవారు తాత్కాలిక మరణమును పొందిన వానిని గుర్తించి బ్రతికించి నపుడు, దానిని మనము గొప్ప మహత్తుగా చెప్పుకొన్నాము. మనము మాత్రము అటువంటి మరణమును గురించి ఏమాత్రము తెలుసుకోలేక పోయాము. ఇప్పటికీ కూడా మనము ఏమాత్రము తాత్కాలిక మరణమును గురించి అర్థము చేసుకోలేదనుటకు ఒక విషయమును వివరిస్తాము చూడండి. ఇప్పుడు ఇక్కడ బైబిలు విషయమును ఉదాహరణగా చెప్పవలసి వున్నది. ఈ విషయమును చెప్పబోవు ముందు నేను విన్నవించుకొనునది ఏమనగా! నేను పూర్తి ఇందువును. నేను చెప్పునది ఇందూధర్మములు. ఇందూ ధర్మములను బలపరుచు ఉదాహరణలు ఎక్కడుండినా వాటిని ఎత్తి చూపడము నా కర్తవ్యము. గతములో ఇందూధర్మముల గొప్పతనమును అపార్థము చేసుకొన్న క్రైస్తవులను మేము విమర్శిస్తూ, బైబిలులో ప్రభువు చెప్పిన మాటలు మీకు ఇంతవరకు అర్థముకాలేదని ప్రభువు మాటను ఎత్తి చూపించాము. అంతేకాక ప్రభువు బోధలకు వ్యతిరేఖమైన వాక్యములు

బైబిలులో ఉన్నాయని ధైర్యముగా చెప్పాము. **"సృష్ఠికర్తకోడ్ 963"** అను చిన్న గ్రంథములో బైబిలులోని ఆదికాండము అబద్దాల పుట్ట అని వ్రాశాము. అయితే మా ఉద్దేశమును తెలియని హిందువులు కొందరు, మమ్ములను పరమతమును బోధించువారిగ చెప్పుకొన్నారు. ఏమాత్రము హిందూ ధర్మములను తెలియనివారు, హిందూధర్మ సంస్థల పేరుతో హిందూ మతమును సర్వనాశనము చేస్తూ, మాలాంటి వారిని కూడ క్రైస్తవమతము నకు సంబంధించినవారిగ చెప్పుకోవడము, హిందువులు తమ వేలుతో తమ కన్నును పొడుచుకొన్నట్లు కాదా అని అడుగుచున్నాను. మేము ఎక్కడైన ఉదాహరణగా బైబిలు విషయమును చెప్పితేనే నన్ను క్రైస్తవుడనీ, క్రైస్తవ మతమును ప్రచారము చేయుచున్నాడని అనుచున్నారే? హిందువులు అందరూ ముఖ్యముగా చెప్పుకొను వివేకానందుడు తన జీవిత చరిత్ర పుస్తకములో 17వ పేజీలో **"ఏసుప్రభువు కాలములో నేను ఉండి వుంటే, ఆనాడు ఆయన (ఏసు) పాదములను నా కన్నీటితో కాకుండా, నా హృదయ రక్తముతో కడిగి వుండేవాడిని" అని చెప్పాడే,** అలా చెప్పిన వివేకానందుడు కూడా క్రైస్తవ మతమును ప్రచారము చేసినట్లేనా? నేను క్రైస్తవులను ఎన్నో ప్రశ్నలడిగాను, ఎన్నో సందర్భములలో వారి అజ్ఞానమును ఎత్తి చూపించాను. నేను వ్రాసిన గ్రంథములను చదవకనే, నేను ఏమి చెప్పుచున్నానని తెలియకనే, అనాలోచితముగా మాట్లాడడము మంచిదికాదని హిందూ సంస్థలని పేరు పెట్టుకొన్న వారికి తెలుపుచున్నాము. హిందూ ధర్మములను తెలియజేస్తున్న వారిని, హిందూ ధర్మములంటే ఏమిటో తెలియనివారు అనవసరముగా విమర్శించడము మంచిది కాదు.

సనాతనమైన హిందూ ధర్మములన్నీ ఆధ్యాత్మికత మీద ఆధారపడి వున్నవి. ఆధ్యాత్మికము ఒక్క హిందూ (ఇందూ) ధర్మములలో తప్ప ఎక్కడా

లేదు. అటువంటి ఆధ్యాత్మిక రహస్యమైన తాత్కాలిక మరణమును గురించి హిందూ ఆధ్మాత్మిక గురువైన మాస్టర్ C.V.V గారి ఉదాహరణను, బ్రహ్మ విద్యాశాస్త్రమునే తెలియ చెప్పిన శ్రీకృష్ణుని ఉదాహరణను చెప్పాము. అట్లే బైబిలులోని ఉదాహరణను కూడ చెప్పుచున్నాను చూడండి. మత్తయి సువార్త 9వ ఆధ్యాయము 23, 24, 25 వాక్యములు **"అంతలో ఏసు ఆ అధికారి ఇంటికి వచ్చి పిల్లన గ్రోవులు వాయించువారినీ, గొల్లు చేయుచుండు జన సమూహమును చూచి స్థలమియ్యుడి ఈ చిన్నది నిద్రించుచున్నదేగానీ చనిపోలేదని" వారితో చెప్పగా వారాయనను అపహసించిరి. జన సమూహమును పంపివేసి, ఆయన లోపలికి వెళ్ళి ఆమె చెయ్యి పట్టుకొనగానే ఆ చిన్నది లేచెను".**

తాత్కాలిక మరణమును పొందినవారు నిద్రావస్థలో ఉందురని మనము ముందుగానే చెప్పుకొన్నట్లు, ఏసు కూడా ఆమె నిద్రించుచున్నది చనిపోలేదు అని అన్నాడు. అక్కడి ప్రజలందరూ చనిపోయినదని చెప్పిన యువతిని చూచి, ఆమె చనిపోలేదు నిద్రించుచున్నదని చెప్పడము వలన, ఆ యువతి పొందినది తాత్కాలిక మరణమని మనకు అర్థమగుచున్నది. పైగా ఏసే ఆమె చనిపోలేదని స్పష్టముగా చెప్పాడు. అయినప్పటికీ ఇంతవరకు తాత్కాలిక మరణము అనునది ఒకటున్నదని క్రైస్తవులు గ్రహించలేక పోయారు. ఆమె చనిపోలేదు అని చెప్పిన ఏసు మాటను గాలికి వదిలివేసి, ఏసు చనిపోయిన మనిషిని బ్రతికించాడు అని చెప్పు కోవడము పొరపాటు కాదా? ఏసు చనిపోలేదు అని చెప్పినప్పటికీ చనిపోయిన వ్యక్తిని లేపినట్లు క్రైస్తవులు చెప్పుకోవడము వలన ఏసు మాటను వారు ఏమాత్రము పట్టించుకోలేదని అర్థమగుచున్నది. ఏసు బ్రతికినప్పుడు చెప్పిన మాటను ఇది గొప్ప రహస్యమని గ్రహించనివారు, ఏసే స్వయముగ

తాత్కాలిక మరణమును పొందినప్పుడు, ఏసును చనిపోయాడని చెప్పడము తప్పుకాదా? ఏసు శుక్రవారము మధ్యాహ్నము మూడు గంటలకు తాత్కాలికముగ చనిపోయి, శనివారమంతా నిద్రించి విశ్రాంతి తీసుకొని, ఆదివారము ఉదయము ఆరు గంటలకే లేస్తే, ఆయన మరణమును జయించాడని కొందరు చెప్పడము, ఉన్న వాస్తవమును దాచి ఏసును కూడా తప్పుగా చిత్రించినట్లు కాదా? అని అడుగుచున్నాను.

పూర్వము ఇందూ (హిందూ) ధర్మములతో కూడుకొన్న ఆధ్యాత్మికతను తెలిసినవారు, మరణములన్నీ సాధారణ మరణములుకావనీ, అందులో కాల మరణమూ, అకాల మరణమూ, తాత్కాలిక మరణములనీ మూడు రకములు గలవని తెలియగలిగారు. అలా వారు తెలియగలిగిందే కాక మూడవరకమును మరణము పొందిన వారిని గుర్తించగలిగారు. గుర్తించడమే కాక వారికి తెలిసిన పద్ధతి ప్రకారము తాత్కాలిక మరణము నుండి లేపగలిగారు. అలాంటి వారిలో అందరికంటే ముందుగా 5200 సంవత్సరముల పూర్వమే, చనిపోయాడనుకొన్న సాందీపుని కొడుకును శ్రీకృష్ణుడు తిరిగి నిద్రనుండి మేల్కొలిపినట్లు లేపి చూపించాడు. దీనినిబట్టి మనకు ద్వాపరయుగములోనే తాత్కాలిక మరణమును పొందిన వారున్నారనీ, ఆకాలములోనే శ్రీకృష్ణుడు ఆ మూడవ మరణమునుండి ఆయన గురువు కొడుకును లేపి చూపించాడని తెలియుచున్నది. మానవులకు ఆధ్యాత్మిక విద్యను శాస్త్రబద్ధముగా తెలిపినవాడు శ్రీకృష్ణుడు. అందువలన ఆయనే ఆధ్యాత్మిక రహస్యమైన మూడవ మరణమును గురించి మొదటనే మనకు అర్థమగునట్లు చేశాడు. అయితే భగవంతుడైన కృష్ణుడు అంత పెద్ద మరణ విషయమును మనము గ్రహించుకొనునట్లు చేసి చూపించినా, దానిని ఎవరూ అర్థము చేసుకోలేదు. ఇదొక ఆధ్యాత్మిక రహస్యమని ఎవరూ

అనుకోక పోవడమేకాక, ఆయన చేసి చూపించిన దానిని మహత్యము క్రిందికి జమకట్టినారు. అప్పటినుండి ఎవరు తాత్కాలిక మరణమును ఛేదించినా, వారు గొప్పవారు, వారు అలా చేయగలిగారు అని అంటున్నారు. మనకు ఈ విషయము ఆధ్యాత్మిక ధర్మమునూ, శరీరములో ఆత్మయొక్క పని తనమునూ తెలుపుచున్నదని ఎవరూ అనుకోలేదు. తాత్కాలిక మరణమును పొందిన వ్యక్తిని గూర్చి ఇతను చనిపోలేదు, నిద్రించుచున్నాడని రెండు వేల సంవత్సరముల పూర్వమే ఏసుప్రభువు చెప్పి, అందరూ చనిపోయాడనుకొన్న వానిని పిలువగా లేచిన వారూ, చేయి పట్టుకొని కదిలించితే లేచిన వారూ కలరు. అయితే అలా బ్రతికించిన వారు చనిపోయిన వానిని లేపుచున్నానని ఎక్కడా చెప్పలేదు. వారు లేపే దానికి ముందే ఇతను నిద్రించుచున్నాడని చెప్పి లేపారు. బైబిలులో రెండు చోట్ల అందరూ మరణించాడనుకొన్న వానిని తిరిగి లేపినపుడు, ఈమె నిద్రించు చున్నదని ఒకచోట చెప్పి లేపడము జరిగినది. అలాగే మరొక చోట లాజరు నిద్రించుచున్నాడని చెప్పి లేపడము జరిగినది. అంతగా ప్రభువు చెప్పిన మాటలను ఏ క్రైస్తవుడూ లెక్కించలేదు. ఏసు చనిపోయిన వానిని లేపినాడని చెప్పుచూ, ఏసు మాటను కూడ అసత్యము చేయుచున్నారు. అంతేకాక ఏసే స్వయాన మూడవ మరణమును పొంది, ఒకరోజు పూర్తి నిద్రించి విశ్రాంతి తీసుకొని, మూడవ రోజు లేస్తే ఏసు మరణమునుండి లేచాడని క్రైస్తవులే ప్రచారము చేశారు. ఈ మాటను ఏసు ఏమాత్రము ఒప్పుకోడు. అందువలన ఏసు చెప్పిన జ్ఞానముగానీ, ఆయన చేసిన పనులుగానీ ఇంతవరకు క్రైస్తవులకు అర్థము కాలేదని చెప్పుచున్నాము. నేను చెప్పడమే కాదు, స్వయాన ఏసుప్రభువు కూడా, నా మాటలు ఆదరణకర్త వచ్చి చెప్పేంతవరకు అర్థముకావు అని చెప్పి పోయాడు. ఏసు క్రైస్తవులకు

ప్రవక్తగ ఉండినప్పటికీ ఆయన కాల మరణము ఎప్పుడు జరిగినదీ, ఎక్కడ జరిగినదీ ఎవరికీ తెలియదు. ఆయన జీవితములో ఒకే ఒక తాత్కాలిక మరణము మాత్రము మనకు తెలుసు. ఏసును గూర్చి మనకు తెలిసినంత కూడ క్రైస్తవులకు తెలియదనియే చెప్పవచ్చును.

## శ్రీకృష్ణుడు పొందిన మరణము ఏది?

ఇందువులకు (హిందువులకు) ధర్మములను తెలియజేసిన ముఖ్యమైన ప్రవక్త శ్రీకృష్ణుడు. కృష్ణుడు మానవునికి కావలసిన ధర్మములన్ని టిని బోధించిన భగవంతుడు. ఆయన తన జీవితములో ఒకమారు తాత్కాలిక మరణమును పొందాడు. తాత్కాలిక మరణము ఇటువంటిదని తెలుపు నిమిత్తము ఆ మరణమును ఆయన పొందాడు. మూడవదైన తాత్కాలిక మరణమును కృష్ణుడు పొందవలసిన అవసరము లేకున్నా, దానిని ఆయన అనుభవించాడను గుర్తుకోసము చిన్న వయస్సులోనే ఆ మరణమును పొందాడు. ఆ విధముగా ఆయన పొందియుండుట వలన అది ఆయనకు తెలియదనుటకు ఎవరికీ వీలులేదు. నాకు తెలిసినంత వరకు చరిత్రలో 5200 సంవత్సరముల పూర్వము కృష్ణుడు తాత్కాలిక మరణమును పొందాడు. అలాగే ఆ మరణమునుండి సాందీపుని కొడుకును లేపాడు. కృష్ణుడు 120 సంవత్సరములు బ్రతికి చివరిలో కాలమరణమును పొందాడు. అంతకు ముందు తన చిన్నవయస్సులో, నందగావ్‌నందు కాళింగ మడుగులో సర్పకాటుకు గురియైనాడు. సర్పము యొక్క విష కోరలు రక్తనాళమునకు దిగుట వలన, రెండు నిమిషములలో విషము మెదడుకు చేరడము వలన కృష్ణుడు తాత్కాలిక మరణమును పొందాడు. ఆ మరణమును పొందిన

కృష్ణుడు కేవలము పది నిమిషములు మాత్రమే మరణించాడు. తాత్కాలిక మరణమును పొందిన కృష్ణుడు దానియందు పది నిమిషములుండి తిరిగి లేచాడు. ఆ మరణములో ఉన్న పది నిమిషములు కృష్ణుడు నిద్రస్థితిని పొంది తర్వాత లేవడము జరిగినది.

కృష్ణుడు పాము కాటుకు గురికావడమేమిటి? ఆయన తాత్కాలిక మరణమును పొందడమేమిటి? అని అందరికీ ఆశ్చర్యము కలుగవచ్చును. ఈ విధముగ జరిగిందని భారతములోగానీ, భాగవతములోగానీ లేదే అని అడుగవచ్చును. వ్రాసే వ్యక్తికి మతిభ్రమించి ఇష్టమొచ్చినట్లు వ్రాశాడని నన్ను దూషించవచ్చును. ఏ ఆధారము లేనిది ఎలా వ్రాశారని ప్రశ్నించ వచ్చును. అంతేకాక ఈ విషయమును ఎవరూ నమ్మరని కూడా నాకు బాగా తెలుసు. అయినా ఇది సత్యము అని తెలుపుచు వ్రాయుచున్నాను. అందరి ప్రశ్నలకు నేను ఒకటే జవాబును చెప్పగలను. నేను ఆ రోజు చూచాను, ఈ రోజు చెప్పుచున్నాను. నేను ఆ రోజు జరిగిన విషయమును చూడలేదు అనుటకు మీ వద్ద ఆధారమేమైనా ఉన్నదా? అని నేను అడిగితే మీరు ఏ ఆధారమునూ చూపలేరు.

మీకు ఇంకా ఆశ్చర్యమును కలుగజేయు విషయమును తెలియ జేస్తాను. మీరు నమ్మినా నమ్మకుండినా చెప్పబోవు విషయము నూటికి నూరుపాళ్ళు సత్యము. అట్లని నేను ఎవరినీ నమ్మించనవసరములేదు. ఎవరు నమ్మినా, ఎవరు నమ్మకుండినా నాకు నష్టమూ లేదు, అలాగే లాభమూ లేదు. ఒక విధముగా నాకు తెలిసిన సత్యమును చెప్పడము నా కర్తవ్యము. అందువలన చెప్పుచున్నాను. చిన్నతనములో కాళింగ మడుగు వద్ద పాము కాటుకు గురియైన కృష్ణుడు దాదాపు పది నిమిషముల కాలము మూడవ

తరగతికి చెందిన తాత్కాలిక మరణమును పొందాడని చెప్పడమే కాక, ఆ దినము కరిచిన నాగుపాము ఒక తలదేననీ, ఫోటోలో చూపినట్లు పది తలల పాముకాదని కూడా తెలుపుచున్నాము. అంతేకాక కృష్ణుని ఎడమ కాలి పిక్కకండ మీద పాము కరిచిందని కూడ చెప్పుచున్నాము. సాధారణముగా నాగుపాము అడుగు లేక అడుగున్నర ఎత్తుకంటే తలను పైకి ఎత్తలేదు. ఆ రోజు కృష్ణున్ని కరిచిన నాగుపాము అడుగు ఎత్తు తలను ఎత్తి ఎడమ కాలికి వెనుక వైపున పిక్క కండకు కరిచింది. కాలి పిక్క కండలోని రక్త నాళములోనికి పాము కోరలు దిగడము వలన, పాము విషము రెండు నిమిషములలోపే శరీరమంతా ప్రాకి తలకెక్కడము జరిగింది. ఆ సమయములోనే కృష్ణుడు తాత్కాలిక మరణమును పొందడము కూడా జరిగింది. నీటి మడుగువద్ద మడుగు బయటే పాము కరవడము జరిగింది. అక్కడున్న తోటి పిల్లలందరూ ఆ విషయమును చూచారు. కరిచిన వెంటనే పాము భయముతో నీటి మడుగులోనికి పోయింది. నాగుపాము నీటిలో చాలాసేపు ఉండలేదు. అందువలన పదిహేను నిమిషముల తర్వాత నీటి నుండి బయటికి వచ్చింది. అంతలో కృష్ణుడు తిరిగి లేచాడు. తనను కరిచిన ఆ పాము మీద కృష్ణునకు కోపము వచ్చింది. పాము బయటికి వచ్చిన వెంటనే కృష్ణుడు మరియు అక్కడున్న వారందరు కలిసి ఆ పామును చంపివేశారు. అంతేతప్ప కాళింగ మడుగులో నాగరాజనీ, నాగరాజుకు ఇద్దరు భార్యలనీ, నాగరాజుకు పది తలలనీ చెప్పడము పూర్తి అసత్యము. ఇప్పుడు మేము చెప్పునదే పూర్తి సత్యము.

పాము కరిచినపుడు కృష్ణుడు చనిపోవడమేమిటి? తిరిగి బ్రతకడ మేమిటి? అనియూ, చనిపోయినవాడు తిరిగి బ్రతుకుతాడా? అనియూ, ఇదంతా నమ్మదగిన విషయమేనా అనియూ అనుమానము రావచ్చును.

దానికి మా జవాబు ఏమనగా! నాగుపాము కరిస్తే ఎవరైనా చనిపోయినా అది కాల మరణముకాదు. అలా చనిపోయినప్పటికీ అది అకాల మరణమని కూడా చెప్పలేము. నాగుపాము కరిచిన వ్యక్తికి శ్వాస నిలిచిపోయి చనిపోయి నప్పటికీ అది పూర్తి మరణముకాదు. నాగుపాము కరిచిన వాడు ఎవడూ పూర్తి కాలమరణమును పొందడు. కాని శ్వాస శరీరములోపలే నిలిచి పోయివుండును. శ్వాస బయటికి పోతేనే పూర్తి మరణము అని మరణ సిద్ధాంతములో చెప్పియున్నాము. 1980 సంవత్సరములో మేము రచించిన **"జనన మరణ సిద్ధాంతము"** అను గ్రంథములో కాలమరణమును గూర్చి పూర్తిగా చెప్పియున్నాము. అకాల మరణమును గురించి **"దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు"** అను గ్రంథములో చెప్పియున్నాము. ఇప్పుడు తాత్కాలిక మరణమును గురించి **"మరణ రహస్యము"** అను ఈ గ్రంథములో చెప్పుచున్నాము. నాగుపాము కరిచినపుడు చనిపోయినవాడు బయటికి కనిపించుటకు మాత్రమే చనిపోయాడని తెలియవలెను. అట్లు చనిపోయిన వాడు వాని శరీరము లోపలే బ్రతికియున్నాడని తెలియవలెను. అటువంటి వాడు కొన్ని గంటలు, కొన్ని దినముల వరకైన నిద్రలోనే ఉండును. తాత్కాలిక మరణమును పొందిన వానిని, ఎవరైనా పాము విషమునకు వైద్యమును తెలిసిన వారు వాని శరీరమునకు వైద్యము చేసి, విషమును తొలగించి వానిని తిరిగి బ్రతికించవచ్చును. దీనివలన నాగుపాము కాటు వలన చనిపోయినవాడు పూర్తి చనిపోడని తెలియు చున్నది.

ద్వాపరయుగములో కృష్ణున్ని కరిచింది కూడా నాగుపామేననీ, అందువలన కృష్ణుడు తాత్కాలిక మరణమును పొందాడనీ, తిరిగి తనకు తానుగా లేచాడనీ చెప్పాము. చిన్న తనములోని పాముకోరల కాట్లు ఆయన

ఎడమ కాలి మీద చిన్న గుర్తులుగా ఉండిపోయాయి. కృష్ణుని విషయములో ఇంతవరకు ఎవరికీ తెలియని రహస్యము పాము కాట్లని చెప్పవచ్చును. ఇవన్నీ మేము ఎలా నమ్మాలి అని ఎవరూ అనుకోకుండా, పాము కాట్ల గుర్తుకు సంబంధించిన రహస్యము మరియొకటి కలదు. కృష్ణుడు భగవంతుడనీ, దైవాంశము చేత పుట్టినవాడని **"శ్రీకృష్ణుడు దేవుడా- భగవంతుడా"** అను గ్రంథములో వ్రాసుకొన్నాము. ఆ గ్రంథములోనే కృష్ణుడు ఇంకా రెండుమార్లు పుట్టుననీ, ఆయన మొత్తము మూడుమార్లు భూమిమీదకు వచ్చి పోవునని చెప్పుకొన్నాము. అంతేకాక ఇప్పటికే రెండవమారు కూడా వచ్చి పోయాడని వ్రాసుకొన్నాము. ఇక మూడవ జన్మ కూడ రాబోతుందని చెప్పుకొన్నాము. కృష్ణుడు రెండవమారు వచ్చినపుడు, ఆయన మొదటి జన్మయిన కృష్ణావతారములో ఎడమ కాలికియున్న పాముకాటు గుర్తులు, రెండవ అవతారములో ధరించిన శరీమునకు కూడ ఉండడము విశేషము. రెండవమారు ధరించిన శరీరమునకు అదే ఎడమ కాలికే, అదే స్థలములో పాముకాటు గుర్తులుండ డము పెద్ద ప్రత్యేకత అని తెలియవలెను. అలా ఎందుకున్నాయి అనగా! కృష్ణుడే ఇప్పుడు ఈ మనిషిగా పుట్టాడని గుర్తుపట్టుటకు ఆధారముగా, పాముకాటు గుర్తులు రెండవ జన్మలో కూడా వచ్చాయని మేము అనుకొంటు న్నాము. మొదటి జన్మకు, రెండవ జన్మకు మూడు వేల సంవత్సరములు వ్యవధి ఉండినప్పటికీ, రెండవ జన్మలో కూడ శరీరము మీద పాము కాటు గుర్తులు రావడము గొప్ప విశేషమే అయినప్పటికీ, ఆ గుర్తుల విషయము కృష్ణుని జన్మలోగానీ, తర్వాత జన్మలోగానీ ఎవరికీ తెలియకుండా పోయాయి.

రెండవ జన్మలో ఒక భక్తురాలు ఆయన కాళ్ళను ఒత్తుచూ ఒక దానికొకటి ప్రక్క ప్రక్కనేవున్న సూది మందముగల రెండు మచ్చలను చూచి

వాటిని గురించి అడిగింది. అప్పుడు **ఆయన అవి నా వెనుకటి జన్మ గుర్తులనీ, నా మరణములో నా వెనుకటి జన్మ ప్రాంతములోనికి పోయి చనిపోతాననీ, నేను ఎక్కడికి పోవునది ఎవరికీ తెలియదనీ, కొంత కాలమే మీవద్ద ఉంటానని చెప్పాడు.** ఆయన మాటలు అప్పుడామెకు ఏమని అర్థమయ్యాయో, తర్వాత వాటిని అనేకమార్లు చూచినప్పటికీ, ఆ గుర్తులను గురించి అడుగలేదు. కృష్ణుడు భారతదేశమందు గుజరాత్ రాష్ట్రములో సమాధి చేయబడ్డాడు. ఆ సమాధి సముద్రములో కలిసిపోయినది. తర్వాత ఆయన జన్మ విదేశములో కల్గినప్పటికీ, ఆయన తిరిగి భారతదేశమునకు వచ్చి గుజరాత్ రాష్ట్రములోనే మరణించాడు. తిరిగి కృష్ణుడు మూడవ జన్మను ఎప్పుడైనా తీసుకొంటే, మూడవ జన్మలో ఆయన ధరించు శరీరమునకు పాముకాట్లు తప్పనిసరిగ ఉంటాయని మేము అనుకొంటు న్నాము. మూడవ జన్మ శరీరమునకు పాముకాట్లు ఎక్కడుంటాయో, మా అంచనాకు రావడము లేదు. కనుక చెప్పలేక పోవుచున్నాము. **ఇంతకీ కృష్ణుని రెండవ జన్మను గురించి ఎవరైనది చెప్పలేదే అను ప్రశ్న ఎవరికైనా వస్తే, రెండవ జన్మను గురించి "కృష్ణుడు దేవుడా-భగవంతుడా" అను గ్రంథములో 'కృష్ణుని మరణము లోకానికి కనువిప్పు' అను అధ్యాయములో సంపూర్ణముగా వ్రాసియున్నాము.** రెండవ జన్మలో కూడా తాత్కాలిక మరణమును పొందిన కృష్ణుడు, తిరిగి మూడు రోజులకు తనకు తానుగా లేచి, దాదాపు 40 రోజులు ఆ ప్రాంతములో ఉండి, అక్కడినుండి ఇందూదేశమునకు వచ్చాడు. ఇక్కడే చనిపోయాడు.

భూమిమీద పుట్టిన ఏ మనిషిగానీ, ఏ జీవరాశిగానీ తప్పనిసరిగా కాలమరణమును పొంది తీరును. అయితే అకాల మరణమును గానీ, తాత్కాలిక మరణమును గానీ పొందవచ్చును లేక పొందక పోవచ్చును.

ఈ రెండు మరణములకు తప్పనిసరి అను నియమము లేదు. అవి ఆ జీవుని కర్మనుబట్టి నిర్ణయింపబడు మరణములని తెలియవలెను. ద్వాపర యుగములో కృష్ణుడు తన కర్మప్రకారము తాత్కాలిక మరణమును పొందాడు. అట్లే తన రెండవ జన్మలో కూడ తాత్కాలిక మరణమును పొందాడు. ఇక మూడవ జన్మలో ఎట్లుంటుందో! అది ఆయన కర్మకు సంబంధించిన విషయము, కావున జరుగబోవు విషయమును చెప్పలేము. మనము ఈ దినము మూడవరక మరణమైన తాత్కాలిక మరణమును గురించి చెప్పుకొనుటకు ఆధారముగా **కృష్ణుడు ఆ మరణమును పొంది చూపించాడు.** అంతేకాక తాత్కాలిక మరణమును పొందినవారు తమకు తాముగా తిరిగి లేవవచ్చునని కూడా నిరూపించి చూపించాడు.

## తాత్కాలిక మరణమును పొందిన వానికి వైద్యము అవసరమా?

పాము కరిచి చనిపోయిన వారికి వైద్యము చేసి బ్రతికించ వచ్చునన్నారు. కృష్ణుడు పాము కరిచి చనిపోయినా తనకు తానుగా లేచాడు. ఇక్కడ రెండు పద్ధతులూ కనిపిస్తున్నవి. ఇందులో ఏ పద్ధతి సరియైనది? పాము విషము వలన చనిపోయిన సాధారణ మనిషి కూడా వైద్యము లేకుండా లేవగలడా? అని కొందరడుగవచ్చును. దానికి నాకు తెలిసిన సమాధానము ఏమనగా! మనిషికి మెలకువ, నిద్ర, స్వప్నము అని మూడు స్థితులు గలవు. ఈ మూడు స్థితులు అందరికీ తెలిసినవే. మనిషి పడుకొన్నపుడు నిద్రలోనికి పోవడమూ, నిద్రలోనికి పోయినవాడు ఎప్పుడైనా స్వప్నములోనికి పోవడమూ జరుగుతుండడము కూడా అందరికీ

తెలిసిన విషయమే. అయితే మనిషి మెలకువ నుండి నిద్రలోనికి ఎట్లు పోతున్నాడు? నిద్రనుండి స్వప్నములోనికి ఎలా పోతున్నాడు? అను విషయము చాలామందికి తెలియని రహస్యమే. మనిషికి నిద్ర మెలకువలు ఎలాంటివో అలాంటివే మరణము, తాత్కాలిక మరణము. అయితే తాత్కాలిక మరణమును పొందినవాడు తర్వాత మరణమును పొందవచ్చును అట్లే మరణమును పొందినవాడు వేరు జన్మకు పోయి మెలకువను పొందుచున్నాడు. దీనినిబట్టి ఒక జీవుడు ఎల్లప్పుడు నిద్ర, మెలకువ, స్వప్నముల మధ్య జీవించున్నాడని తెలియుచున్నది. అదే విధముగా ఒక జీవుడు జీవితము, మరణ, తాత్కాలిక మరణములను పొందుచున్నాడని తెలియుచున్నది. మనిషి పడుకొన్నపుడు చాలామందికి మొదట నిద్రవస్తున్నది, తర్వాత స్వప్నము కూడా వస్తున్నది. ఎప్పుడైనా ఒకప్పుడు మొదట జీవుడు స్వప్నములోనికి పోవుచున్నాడు. అలా మొదటనే స్వప్నములోనికి పోయిన వాడు తిరిగి మెలకువలోనికి వస్తున్నాడు. ఒక్కొక్కప్పుడు స్వప్నము నుండి నేరుగా నిద్రలోనికే పోవుచున్నాడు. దీనినిబట్టి మెలకువలో ఉన్నవాడు నేరుగా నిద్రలోనికి పోవుననీ చెప్పలేము. అట్లే స్వప్నములోనికి పోయినవాడు నేరుగా మెలకువలోనికి పోవుననీ చెప్పలేము. ఏ స్థితి నుండి ఏ స్థితికైనా పోవచ్చును. అలాగే మనిషి (జీవుడు) జీవితమునుండి మరణమును పొందుచున్నాడు. కానీ ఎప్పుడైనా ఒకప్పుడు తాత్కాలిక మరణమును కూడా పొందుచున్నాడు. తాత్కాలిక మరణము పొందినవాడు తిరిగి జీవితములోనికి రావచ్చును. లేకపోతే నేరుగా మరణములోనికైనా పోవచ్చును. అందువలన జీవితము, మరణము, తాత్కాలిక మరణము అనునవి మెలకువ, నిద్ర, స్వప్నములతో సమానముగా ఉన్నవని చెప్ప వచ్చును.

మనిషి మెలకువలో ఉన్నప్పుడు శరీరములోని ఐదు జ్ఞానేంద్రియములు పని చేయుచున్నవి. కన్ను చూపిస్తూవుంది, చెవు వినిపిస్తూవుంది. కావున లోపలనున్న జీవునికి బయటి సమాచారము తెలియుచున్నది. ఎవరైనా తన పేరుపెట్టి పిలిస్తే వెంటనే వారి వైపు చూచి వారితో మాట్లాడడము జరుగుచున్నది. పిలిచిన వెంటనే ఆ పిలిచిన విషయము మెలకువలో ఉన్నాడు కాబట్టి జీవునకు తెలిసింది. మెలకువలో చెవి వలన శబ్దము తెలిసింది. అదే నిద్రలో అయితే మనిషికి ఐదు ఇంద్రియముల నుండి సమాచారము ఏమాత్రము తెలియదు కారణమేమనగా? ఇంద్రియముల నుండి సమాచారమును జీవునికి చేరవేయు మనస్సు శరీరములో లేదు. కావున చెవినుండి ఏ సమాచారమూ నిద్రలో నున్న జీవునికి చేరదు. అయితే ఎవడైనా నిద్ర పోవునప్పుడు అతనిని పిలిచినా అతడు నిద్రనుండి లేవగల్గుచున్నాడు. అయితే నిద్రపోవు వానిని పిలిచినపుడు ఆ పిలుపు నిద్రలోనున్న వానికి ఎలా వినిపించిది? నన్నే పిలుస్తున్నారని వానికెలా తెలిసింది? వాడు ఎలా లేవగలిగాడు? అను ప్రశ్నలకు జవాబును తెలుసుకొంటే మనిషికి గల నిద్ర, మెలకువ, స్వప్నము యొక్క రహస్యములు తెలియును. నిద్ర, మెలకువ, స్వప్నము యొక్క వివరమును పూర్తిగా తెలియగలిగితే తర్వాత జీవితము, మరణము, తాత్కాలిక మరణములను గురించి సులభముగా తెలియవచ్చును. అందువలన ముందు నిద్ర, మెలకువ, స్వప్నములను గురించి తెలుసు కొందాము. మెలకువ జీవితము లాంటిది, నిద్ర మరణములాంటిది, తాత్కాలిక మరణము స్వప్నములాంటిది. మనిషి బయట ఎంత హోదాలో ఉండినా శరీరములో తన స్థితి ఏమిటో? తాను ఎవరో? తనకే తెలియని పరిస్థితిలో ఉన్నాడు. మెలకువ గల జీవితములోనున్న మనిషి శరీరమందు జీవునితో సహా 25 భాగములు

కలవు. ఆ 25 భాగములను ఆత్మ శక్తినిచ్చి నడిపిస్తున్నది. అందువలన **అన్నీ నేననుకొని ఉచ్చాగాడుగా విర్రవీగు జీవుడు శరీరములో ఒక లుచ్చాగాడు మాత్రమే!** తాను ఉచ్చాగా (గొప్పగా) ఉన్నాననుకొను జీవుడు, అన్ని శరీర భాగములకంటే లుచ్చాగా (నీచముగా) ఉన్నానని తెలియక తనకు తాను గొప్పగ భ్రమించుచున్నాడు. శరీరములో జీవుడు కేవలము సుఖదుఃఖములను అనుభవించే పనిని మాత్రమే చేయు చున్నాడు. అదే శరీరములోని మనస్సు, జీవునికంటే గొప్పగా రెండు రకముల పనులను చేయుచున్నది. అట్లే బుద్ధి రెండు రకములుగా పనిచేయుచున్నది. రెండు రెండు పనులను చేయు మనస్సు, బుద్ధికంటే ఒక పనిని మాత్రమే చేయు జీవుడు తక్కువవాడేనని చెప్పవచ్చును.

నిద్రలో శరీరములోని జీవునికి బయటి విషయములు ఏమీ తెలియవు. అందువలన ఆ సమయములో జీవుడు అన్ని రకములా అంధుడనియే చెప్పవచ్చును. మెలకువలో శరీరమంతా వ్యాపించియున్న మనస్సు, నిద్రలో శరీరమంతటిని వదలి తలలోని బ్రహ్మనాడిలో మాత్రమే ఉండిపోవుచున్నది. బయటి విషయములను తెలియజేయు మనస్సు శరీరమంతట లేని దానివలన, శరీరము బయటగల జ్ఞానేంద్రియముల విషయములు జీవునికి తెలియకుండ పోవుచున్నవి. అందువలన నిద్రలో నున్న వానిని పిలిచినా ఆ మాట లోపల జీవుని వరకు చేరదు. తనను పిలిచినట్లు జీవునికి తెలియదు. అయినా బయటి వ్యక్తి పిలిచినపుడు నిద్రలోనున్నవాడు ఎవరో తనను పిలుస్తున్నారని తెలిసి మెలకువలోనికి వస్తున్నాడు. జీవునికి బయట జ్ఞానేంద్రియముల యొక్క సమాచారమును చేరవేయు మధ్యవర్తిలాంటి మనస్సులేనపుడు, బయటి పిలుపు లోపలనున్న జీవునికి ఎలా తెలిసింది? అను ప్రశ్నకు జవాబుగా బయట పిలిచినది

మనస్సు ద్వారా జీవుని చేరలేదనియే చెప్పవచ్చును. అయితే ఆ సమయములో శరీరమంతా వ్యాపించియున్న ఆత్మ స్వయముగా బయట ఎవరో పిలిచినట్లు లోపలి మనస్సుకు తెలియునట్లు చేయుచున్నది. ఆత్మయే బ్రహ్మనాడిలో అణిగియున్న మనస్సుకు తెలుపుట వలన మనస్సు మౌనమును వదలి ఎరుకలోనికి వచ్చి శరీరమంతా క్షణాలలో వ్యాపించుచున్నది. అలా మనస్సు శరీరమంతా ప్రాకడము వలన బయటి ఇంద్రియముల విషయములన్నియు ఆ క్షణమునుండి జీవునికి తెలియుచున్నవి. మొదట నిద్రలోనున్న జీవునికి జ్ఞప్తిలోనికి తెచ్చుటకు ఆత్మయే కారణమైనదనీ, ఆత్మయే మనస్సును జాగృత పరిచినదనీ, అందువలన నిద్రనుండి మనిషి లేవగల్గుచున్నాడనీ తెలియు చున్నది. మనిషి నిద్రలోనికి పోవునదీ, ఆ నిద్ర సమయములో మనిషికి బయట విషయములు ఏమీ తెలియకుండ పోవునదీ అందరికీ తెలిసిన విషయమే. నిద్రలో బయటి సమాచారము తెలియని మనిషికి తనను పిలిచినప్పుడే తనను పిలిచినట్లు ఎలా తెలిసింది? అను ప్రశ్నకు **కొన్ని ప్రత్యేక విషయములను ఆత్మయే లోపల మనస్సుకు తెలిపి లేపుచున్నదని అర్థమగుచున్నది.**

నిద్రను మరణముతో సమానముగా చెప్పియున్నాము. తాత్కాలిక మరణమును స్వప్నముతో సమానముగా పోల్చి చెప్పియున్నాము. నిద్రలో గానీ, స్వప్నములో గానీ మనిషి బయటి సంబంధము లేకున్నాడు. అందువలన స్వప్నములోనున్న వానిని కూడా బయట నిద్రలోనున్నట్లే మనము లెక్కించుచున్నాము. శరీరములోపల జీవుడు స్వప్నములో ఉండినప్పటికీ, అది స్వప్నావస్థని ఎవరికీ తెలియదు. దానిని నిద్రయనియే అందరూ అనుకొందురు. అలాగే మరణించిన వానిని గానీ, తాత్కాలిక మరణమును పొందిన వానిని గానీ, మరణించిన వాని క్రిందనే జమకట్టి

చూస్తున్నాము. స్వప్నములోనున్నవాడు కూడా బయటికి నిద్రించినట్లే కనబడుచున్నట్లు, తాత్కాలిక మరణమును పొందినవాడు కూడా బయటికి మరణించినట్లే కనబడుచున్నాడు. నిద్ర, స్వప్నము రెండూ బయటికి ఒకే లాగున కనిపించినప్పటికీ కొందరు అనుభవజ్ఞులు నిద్రను, స్వప్నమును వేరువేరుగా గుర్తించుదురు. నిద్రా, స్వప్నమూ ఒకే విధముగా ఉన్నప్పటికీ స్వల్ప తేడాతో ఉన్నవనీ, గాఢనిద్రలో మనిషికి శ్వాస ఎక్కువగా శబ్దము చేయుచు ఆడుచుండుననీ, అదే స్వప్నములో అయితే శ్వాస శబ్దము లేకుండా ఉండుననీ చెప్పకలుగుచున్నారు. అదే విధముగా కొందరు ఆత్మను అధ్యయనము చేసినవారు మరణమునూ, తాత్కాలిక మరణమును స్వల్ప తేడాతో గుర్తించగలుచున్నారు. అలా శ్రీకృష్ణుడు, ఏసు మొదలగు వారు మాత్రమే తాత్కాలిక మరణమును గుర్తించగలిగారు. ఆ మరణమును పొందినవారిని లేపగలిగారు. తాత్కాలిక మరణమును పొందిన వానిని అందరూ చనిపోయాడని భావించినా, దాని వివరము తెలిసినవారు చనిపోలేదనీ, నిద్రించుచున్నాడనీ తెలిపారు. తాత్కాలిక మరణమును మీరు గుర్తించగలరా? అని ఎవరైనా నన్ను అడిగితే, స్వప్నములోనున్న వానిని గుర్తించగలనేమో, కానీ తాత్కాలిక మరణమును పొందిన వానిని గుర్తించలేనని చెప్పుచున్నాను.

పూర్వము కృష్ణుడు, ఏసు ఎలా గుర్తించగలిగారు? ఎలా లేప గలిగారు? అను ప్రశ్నలకు నావద్ద జవాబులేదనియే చెప్పుచున్నాను. ఎందుకనగా! కృష్ణుడు, ఏసు అంతటివాడిని నేను కాదు కదా! ఇకపోతే మూడవరక మరణము నుండి బ్రతికిన వాని శరీరములో ఏమి జరిగిందో చెప్పగలను. మూడవరక మరణమైన తాత్కాలిక మరణమును పొందిన కొందరికి మాత్రమే వైద్యము అవసరము. ఉదాహరణకు నాగుపాము

కరిచినప్పుడు శరీరములోనికి ఎక్కిన విషములోనూ, కరిచిన పాము ఉద్దేశములోనూ కొన్ని తేడాలుండును. నాగుపాము విషము మత్తుమందు లాంటిది. ఎక్కువ మోతాదు మత్తుమందును తిన్నవాడు చనిపోయినట్లుగా మనిషి చనిపోగలడు. మనుషులలో పూర్తి ఎరుకగలవారు, తక్కువ ఎరుకగలవారు కలరు. తక్కువ ఎరుక గలవారు తొందరగా నిద్రలోనికి పోవుచుందురు. ఎక్కువ ఎరుక కల్గిన వారు నిద్రలోనికి తొందరగా పోరు. అటువంటి వారు కొంతవరకు నిద్రను జయించి ఉందురని చెప్పవచ్చును. యోగులకైతే మనస్సును జయించు శక్తివుండును. కనుక అటువంటివారు అందరికంటే ఎక్కువ ఎరుక కల్గినవారై ఉందురు. ఈ విధముగ మూడు రకముల ఎరుకలున్న వారిగా మనుషలను విభజించవచ్చును. తక్కువ ఎరుకగల వారిని వైద్యమును ఉపయోగించి బ్రతికించవచ్చును. ఎక్కువ ఎరుక కల్గిన రెండవ రకము వారిని వైద్యము లేకుండా బ్రతికించవచ్చును. మూడవరకమైన అందరి కంటే ఎక్కువ ఎరుకగలవారు, ఇతరుల సహాయము లేకుండానే బ్రతుకగలరు. దీనినిబట్టి తాత్కాలిక మరణమును పొందిన అందరికీ వైద్యము అవసరములేదనీ, కొందరికి మాత్రమే వైద్యము అవసరమని తెల్పుచున్నాము. వైద్యము అవసరమైనవారిని గుర్తించలేక పోయినా, వారికి వైద్యము అందించ లేకపోయినా, అటువంటివారు స్వప్నమునుండి నిద్రలోనికి పోయినట్లు, కొన్ని గంటల తర్వాతగానీ, కొన్ని దినముల తర్వాతగానీ తాత్కాలిక మరణము నుండి మరణములోనికి పోగలరు. మధ్యరకము ఎరుక కల్గిన వారిని వైద్యము యొక్క అవసరము లేకుండా బ్రతికించవచ్చును. అటువంటి వారు కూడా ఒక్కొక్కప్పుడు తమకుతాముగా మెలకువలోనికి రాగలరు. అయితే బయట ప్రజలు తాత్కాలిక మరణమును పొందిన వానిని గుర్తించలేక పూర్తి మరణించాడని

తలచి, పూడ్చిపెట్టితే చివరకు వారు పూర్తిగా మరణించ వలసి వస్తుంది. అట్లు పొరపాటుగా చాలామందిని పూడ్చిపెట్టడము జరిగింది. పూడ్చిన తర్వాత జ్ఞాపకము వచ్చినప్పటికీ ఊపిరాడక పూర్తి మరణమును పొందవలసివస్తుంది.

మధ్యరకము ఎరుకవున్నవారిని గుర్తించగలిగి వీరు చనిపోలేదు నిద్రావస్థలో ఉన్నారని గ్రహించిన కృష్ణుడులాంటి ఆధ్యాత్మికవేత్తలు, చనిపోయిన వానివద్దకు పోయి, వానిని పేరుతో పిలిచినా, లేక చేతితో తట్టి లేపినా, మరణించాడనుకొన్నవాడు లేవగల్గుచున్నాడు. అంతవరకు మరణించినట్లు పడియున్న వ్యక్తి లేచుట వలన ప్రక్కన చూచు వారందరూ అది గొప్ప మహత్తనీ, చనిపోయిన వానిని బ్రతికించిన వ్యక్తిని పొగడడము జరుగుచున్నది. అప్పుడు కూడ వాడు చనిపోలేదని బ్రతికించిన వారు చెప్పినప్పటికీ, ఇటువంటి మరణము ఒకటుందని మనుషులు గ్రహించలేక పోయారు. అలా బ్రతికించిన ఆధ్యాత్మికవేత్తలు కొందరున్నారు. ఆధ్యాత్మికమునకే ధర్మములు తెల్పిన భగవంతుడూ ఉన్నాడు. మొత్తము మీద తాత్కాలిక మరణమునుండి బ్రతికించిన వారు గొప్పవారనియే చెప్పవచ్చును. ఆత్మను అధ్యయనము చేసిన ఆధ్యాత్మికులకు ఆత్మ విషయమంతా వివరముగా తెలియును. కనుక వారికి తాత్కాలిక మరణమును పొందిన వారి శరీరములో ఆత్మ అన్నిటినీ స్థంభింప చేసినదనీ, లోపలికి పోయిన శ్వాస లోపలే ఉండిపోయినదనీ తెలిసి అటువంటి వారినే బ్రతికించదలచుకొంటారు. కృష్ణుడు సాందీపుని కుమారుడు చనిపోయాడని అక్కడికి పోయాడు. అక్కడికి పోయిన తర్వాత తన గురువు సాందీపుని కుమారుడు పూర్తి చనిపోలేదనీ, తాత్కాలిక మరణమును మాత్రమే పొంది నిద్రించుచున్నాడనీ తెలుసుకొన్నాడు. అప్పుడు ఆ బాలున్ని తిరిగి

నిద్రనుండి లేపాలనుకొన్నాడు. అక్కడి వారు చూచేదానికి ఏదో ఒక తతంగము చేసి, చనిపోయిన బాలున్ని చేయిపట్టుకొని తట్టి పిలువగా ఆ బాలుడు ఊపిరి పోసుకొని లేచి కూర్చొన్నాడు.

## తాత్కాలిక మరణము పొందిన శరీరము చెడిపోదా?

పూర్తి మరణించిన శరీరములో ఆత్మ ఉండదు. శరీరములో అణువణువున వ్యాపించి ప్రతి ధాతుకణమునూ పని చేయించు ఆత్మ తాత్కాలిక మరణము పొందిన శరీరములో ఉన్నది. ఆత్మలేని శరీరములో ధాతుకణములలో మార్పు ఏర్పడి 'ధనుంజయ' అను వాయువు తయారై కణములు చెడిపోవును. శరీరమంతా వాయువు ఏర్పడి శరీరము ఉబ్బిపోయి చివరకు పగిలిపోవును. ఆత్మ ఉన్న తాత్కాలిక మరణములో ఆత్మ యొక్క చైతన్యశక్తి మాత్రము శరీరమంతా లేకుండా పోయి తల మధ్య భాగములోవున్న బ్రహ్మనాడిలో అణిగిపోవుచున్నది. ఆత్మ తన శక్తిని శరీర భాగముల నుండి పంపి బ్రహ్మనాడిలో పై భాగమున అణిగిపోవునట్లు చేయుచున్నది. ఆత్మ తన శక్తిని శరీరమునుండి బ్రహ్మనాడిలోనికి పంపి తానుమాత్రము శరీరమంతా ఉండుట వలన శరీరమందు ఏ భాగములోని ధాతుకణము కూడ చెడిపోదు. చైతన్యరహిత ఆత్మ శరీరమంతా వ్యాపించి యుండుట వలన, తాత్కాలిక మరణమును పొందిన శరీరము మార్పు చెందదు. అంతేకాక కుళ్ళిపోదు, కాళ్ళు, చేతుల కీళ్ళలోని నరములు గట్టిపడని దానివలన కాళ్ళు, చేతులు వంగుచుండును. ఆత్మ తన చైతన్యమును మాత్రము బ్రహ్మనాడిలోనికి పంపి, తాను మాత్రము

శరీరమంతా తాత్కాలిక మరణములో ఉండునని తెలియవలెను. అటువంటి చెడిపోని శరీరములోనూ, కాళ్ళు చేతుల కీళ్ళు వంగుచున్న శరీరములను చూచిన పెద్దలు వీరు తాత్కాలిక మరణమును పొందారని గ్రహించి అటువంటి వారినే తిరిగి లేపగలిగారు. ఒక వ్యక్తి చనిపోయినపుడు జీవుడు అవసానదశ పొంది చనిపోతే, అది పూర్తి మరణము (కాలమరణము) అగును. అవసాన దశ పొందకుండా చనిపోతే, అది అకాలమరణమైనా కావచ్చును లేక తాత్కాలిక మరణమైనా కావచ్చును. కాలమరణములోగానీ, అకాలమరణములోగానీ ఆత్మ, జీవాత్మ శరీరమును వదలిపోవును. అలాగే అకాల మరణములోగానీ, తాత్కాలిక మరణములోగానీ అవసానదశ ఉండదు. తాత్కాలిక మరణమును పొందిన శరీరము చెడిపోదు. కావున అతను తిరిగి బ్రతుకుటకు అవకాశము గలదు. కాలమరణములో అనగా పూర్తి మరణములో ఆత్మ స్థూల, సూక్ష్మ శరీరములను వదలి పోవుచున్నది. అకాలమరణములో ఆత్మ స్థూల శరీరమును మాత్రము వదలి సూక్ష్మ శరీరములో ఉంటున్నది. తాత్కాలిక మరణములో ఆత్మ స్థూల శరీరమును గానీ, సూక్ష్మశరీరముగానీ వదలడము లేదని తెలియవలెను. దీనినిబట్టి మూడవ మరణమును పొందిన శరీరము బ్రతికే ఉన్నదని చెప్పవచ్చును.

## (మంచు సముద్రములో 1993వ సంవత్సరము జరిగిన సంఘటన)

జనవరి 2011, 30వ తేదిన 'నేషనల్ జియోగ్రఫిక్' అను టీవీ ఛానల్‌లో "ట్రు స్టోరీస్" అను పేరుతో (Against All Odds) అను సంఘటన ప్రసారమైనది. అందులో పదిమందితో కూడిన ఒక పరిశోధన బృందము మంచుతో పేరుకొన్న సముద్రము మీద ప్రయాణిస్తూవుంటుంది. మంచు మీద జారే చిన్నచిన్న వాహనముల మీద వారు ప్రయాణిస్తూవుంటారు. ఒక్కొక్కరు ఒక్కొక్క వాహనము మీద మంచు సముద్రము మీద గంటకు

పది, పదిహేను కిలోమీటర్ల వేగముతో పోతూవుంటారు. పైన మంచు రాయిలాగ పేరుకు పోయివున్నా, మూడు లేక నాలుగు అడుగుల లోతులో చల్లని నీటి సముద్రము ఉండేది. ఎక్కడైనా కొన్నిచోట్ల సీలు చేపలు బయటికి వచ్చేదానికి మంచుగడ్డను రంధ్రము చేసుకొనివుండేవి. అటువంటి రంధ్రములను జాగ్రత్తగా గమనిస్తూ ఆ పరిశోధక బృందము ముందుకు సాగేవారు. 1993 మార్చి 21వ తేదీన రాత్రి పదిగంటల సమయములో ఆ బృందములోని ఒక వ్యక్తి ప్రమాదవశాత్తు సీలు చేపలు చేసిన రంధ్రములో తన వాహనముతో సహా సముద్రములోనికి పడిపోయాడు. దాదాపు మూడు అడుగుల మంచుగడ్డ క్రింద చల్లని నీటిలో పడిపోయిన వ్యక్తి బయటికి రాలేకపోయాడు. కొన్ని నిమిషాలకు అతను నీటిలోనే చనిపోవడము జరిగినది. 10 గంటల 20 నిమిషములకు అతనిని వెదికే దానికి అతని బృందము వారు ప్రారంభించారు. దాదాపు ఒక గంటసేపు వెదికితే 11 గంటల 20 నిమిషాముల సమయములో దొరికాడు.

అప్పటికే అతను చనిపోయి గంటసేపు నుండి నీటిలోనే ఉన్నాడు. అతనిని బయటికి తెచ్చి 14 కిలోమీటర్ల దూరములోనున్న ఆసుపత్రికి చేర్చేదానికి 32 నిమిషములు పట్టింది. డాక్టర్లు వచ్చి చూచేటప్పటికి 8 నిమిషములు పట్టింది. 12 గంటలకు డాక్టర్లు వచ్చి అతనికి ఏమాత్రము ప్రాణము లేనట్లు గమనించారు. అతని శరీరములో రక్తము గడ్డకట్టుకపోయి చర్మము నీలమురంగుగా మారినట్లు గమనించారు. గుండెపూర్తిగా ఆగిపోయి నాడి ఏమాత్రము లేకుండ పోయింది. ఆధునిక భౌతికశాస్త్రము ప్రకారము అన్ని పరీక్షలకు అతను చనిపోయినట్లే లెక్కించబడినది. అప్పటికి అతను చనిపోయి దాదాపు రెండున్నర నుండి మూడు గంటల కాలమైనట్లు నిర్ధారణకు వచ్చారు. అయితే వారిలో ఒక డాక్టరుకు లోపల ఒక ప్రేరణ

జరిగి చనిపోయిన ఆ వ్యక్తికి వైద్య ప్రయత్నము చేయాలనుకొన్నాడు. ఆ విధముగా ఏ డాక్టరూ అనుకోడు. అయినప్పటికీ డాక్టరు, చనిపోయిన వ్యక్తికి వైద్యము చేయాలనుకోవడము ఆత్మ ప్రేరణయేనని నేను అనుకొంటున్నాను. వైద్యము చేయాలనుకొన్న డాక్టరు మెదడులో ఏ యోచన అందించబడినదో దాని ప్రకారము ఆయన ఆ శరీరమునకు వైద్యము చేశాడు. అది పెద్ద ఆసుపత్రి కావడమూ, అందులో అన్ని వైద్య సదుపాయములు ఉండడమూ, రక్తమును మార్చే యంత్రముతో సహా కావలసిన అన్ని యంత్రములు ఉండడమూ విశేషము. అన్ని యంత్రములు ఉండడము వలన వైద్యము చేయాలనుకొన్న డాక్టరు ధైర్యముగా తన పనిని సాగించాడు. అతని బృందములో మిగత పదిమంది డాక్టర్లు పని చేశారు.

డాక్టర్లందరూ కలిసికట్టుగా రెండు గంటల కాలము శ్రమించి వైద్యము చేశారు. అలా చేయగా ఉన్నట్లుండి అంతవరకు ఏ కదలిక లేకుండ చనిపోయిన శరీరములో గుండె కొట్టుకోవడము ప్రారంభించింది. గుండె ఒక పద్ధతిగా కొట్టుకోకుండ ఇష్టము వచ్చినట్లు హెచ్చు తగ్గులుగా కొట్టుకోవడమును గ్రహించిన డాక్టర్లు వెంటనే మరియొక యంత్ర సహాయముతో గుండెను సక్రమముగా కొట్టుకొనునట్లు చేశారు. అప్పటికి అన్నీ సరిపోయినట్లే అయినది. గుండె కొట్టుకోవడము, రక్తము ప్రవహించడము, శ్వాస ఆడడము, నాడి సరిగా ఉండడము జరిగినది. ఈ విధముగా 2 గంటల 12 నిమిషముల కాలము వైద్యము చేయగా చనిపోయిన వ్యక్తి తిరిగి బ్రతకడము జరిగినది. అప్పటికి అతను ఐదు గంటలు మరణించి తిరిగి బ్రతకడము జరిగినది. అక్కడి డాక్టర్లు తమ వైద్యము మరణాన్ని జయించిందని సంతోషపడినారు. ఈ సంఘటన పూర్వమెప్పుడో జరిగినది కాదు. ఇప్పటికి 18 సంవత్సరములప్పుడు

1993వ సంవత్సము మార్చి 21వ తేదిన జరిగిన సమాచారమును యదార్థ కథలు (TRUE STORIES) అను సమాచారము పేరుతో టీవీ ఛానల్‌లో ప్రసారము చేశారు. ఇది ఆధునిక వైద్యము ద్వారా, ఆధునిక డాక్టర్ల ముందర జరిగిన సంఘటన. కావున దీనిని ఏ హేతువాది, ఏ నాస్తికవాది కాదనుటకు గానీ, ఇది మూఢనమ్మకమని కొట్టివేయుటకుగానీ అవకాశము లేదు.

**(జమ్ము, కాశ్మీర్‌లోని అబ్దుల్ అజీజ్ కథ)**

2009 డిశంబర్ 7వ తేదీన టీవీ9 లో మధ్యాహ్నము 1-30 నిమిషములకు ఒక కథనము ప్రసారమైనది. అదేమనగా! అప్పటికి వారము రోజుల క్రితము అనగా 2009 నవంబరు, 30వ తేదీన జమ్ము కాశ్మీరులోని రాజౌరి అను గ్రామములో అబ్దుల్ అజీజ్ అను 60 సంవత్సరముల వృద్ధుడు చనిపోయాడు. అతను ముస్లీమ్ అయిన దానివలన ఇస్లామ్ సాంప్రదాయము ప్రకారము అతనిని భూమిలో పూడ్చిపెట్టడము జరిగింది. అతనిని పూడ్చిపెట్టిన మూడు రోజులకు అతను సాధారణముగా చనిపోలేదనీ, ఎవరో హత్య చేశారని ఆరోపణ పోలీసులకు చేరింది. వెంటనే పోలీసులు కేసు వ్రాసుకొని స్మశానానికి పోయి, అబ్దుల్ అజీజ్ శవమును బంధువుల సమక్షములోనే వెలికి తీశారు. వెలికి తీసిన అబ్దుల్ అజీజ్ శరీరమును పోస్టుమార్టమ్ (శవపరీక్ష) కొరకు ప్రభుత్వ ఆసుపత్రికి పంపించారు. అందులోని డాక్టర్ శవపరీక్ష చేయను మొదలు పెట్టాడు. మొదట తల భాగమును పరీక్షించుటకు తలమీద చర్మమును తీయుటకు కత్తితో తలమీద కొట్టడము జరిగింది. తలమీద గాయమైంది. అప్పుడు అందరికి ఆశ్చర్యమగునట్లు అంతవరకు చనిపోయిన అబ్దుల్‌అజీజ్ లేచి కూర్చొని నన్నేమి చేయుచున్నారని ప్రశ్నించాడు అలా అతను లేచి అడగడము

డాక్టర్‌కు నమ్మశక్యము కాలేదు. అయినా డాక్టరు తేరుకొని అతను అడిగిన ప్రశ్నకు నిన్ను శవపరీక్ష చేయుచున్నామని చెప్పాడు. దానికి అబ్దుల్‌అజీజ్ నేను బ్రతికే ఉన్నానుకదా! అని అన్నాడు. అంతలో డాక్టర్‌గారు అబ్దుల్‌అజీజ్ యొక్క బంధువులకు విషయమును తెలుపగా, బయటనున్న బంధువులు వచ్చి ఆయనను తీసుకుపోవడము జరిగినది. మూడు రోజుల క్రిందట అబ్దుల్‌అజీజ్ చనిపోయినపుడు పదిహేను నిమిషముల తర్వాత పరీక్షించి చూచి అతను చనిపోయాడని చెప్పానని అజీజ్ విషయములో అద్భుతము జరిగిందని డాక్టరు చెప్పడము జరిగింది. రాజౌరి గ్రామ ప్రజలు కూడా తమ చేతులతో పూడ్చిపెట్టిన అబ్దుల్‌అజీజ్ మూడు రోజుల తర్వాత బ్రతికి రావడమేమని ఆశ్చర్యమును వ్యక్తము చేశారు. ఈ సంఘటన జరిగి ఇప్పటికి కేవలము ఒక్క సంవత్సరము మూడు నెలలు మాత్రమే అవుతుంది. ఈ విషయమును అందరికీ తెలిసేలాగ ఆ రోజే టీవీ ఛానళ్ళు అన్ని ప్రసారము చేశాయి. ఈ సంఘటన కూడ డాక్టర్ల సమక్షములోనే జరిగింది. కావున ఎవరూ దీనిని ఖండించడానికిగానీ, మూఢ నమ్మకమనుటకుగానీ వీలులేదు.

**(విశాఖ జిల్లాలో జరిగిన ఒక సంఘటన)**

విశాఖజిల్లాలో అరకు లోయకు పోవు దారిలో శృంగవరపుకోట అను ఊరు కలదు. శృంగవరపుకోట మండలమునందు అక్కడికి 12 కిలోమీటర్ల దూరములో సారెపురము అను గ్రామము కలదు. సారెపురము గ్రామములో 67 సంవత్సరముల వయస్సున్న సముద్రమ్మ అను పేరుగల ఆడమనిషి ఉండేది. ఆమెకు దాదాపు పది సంవత్సరములనుండి హైబిపి. మరియు సుగర్‌వ్యాధి ఉండేవి. ఆమె శృంగవరపు కోటలోని సీనియర్

డాక్టరయిన ధర్మలింగాచారి వద్ద వైద్యము చేయించుకొనేది. ఎం.బి.బి. యస్ డాక్టరు ధర్మలింగాచారిగారు మంచి పేరుగాంచిన దాదాపు 60 సంవత్సరముల వయస్సుగల అనుభవజ్ఞుడు. ఇప్పటికి రెండు సంవత్సరముల క్రితము ఒకరోజు సాయంకాలము 6 గంటల సమయములో సముద్రమ్మను డాక్టరు ధర్మలింగాచారి వద్దకు తీసుకరావడము జరిగినది. అంతకుముందే ప్రభుత్వ ఆసుపత్రిలో చనిపోయిందని చెప్పిన తర్వాత అక్కడికి తీసుకవచ్చారు. అప్పుడు డాక్టరు గారు ఆమెను చూడగా ఆమె శరీరములో బి.పి గానీ, నాడిగానీ ఏమాత్రము లేదు. ఆమె శ్వాసగానీ, నాడి (పల్స్)గానీ ఏమాత్రము లేనందున ఆమెను చనిపోయినట్లు నిర్ధారించిన డాక్టరు "ఇంటికి తీసుకెళ్ళండి, ఈమె చనిపోయింది, ఈమెకు వైద్యము అవసరములేదు అన్నాడు." అప్పుడు వారు 12 కిలోమీటర్ల దూరములోనున్న వారి గ్రామమునకు తీసుకెళ్ళారు. అప్పటికే రాత్రి అయినందున ఉదయమే ఆమెను పూడ్చాలనుకొన్నారు. తెల్లవారగానే వర్షము ప్రారంభమై రెండు రోజులు ఏమాత్రము వదలకుండ కురియు చుండుట వలన బయటికి పోయేదానికి అవకాశమే లేకుండ పోయింది. సముద్రమ్మ శవాన్ని అలాగే మూడురోజులు వరండాలోనే ఉంచారు. మూడు రోజుల తర్వాత నాల్గవరోజు ఉదయము ఆమె లేచి కూర్చొని అందరినీ పిలిచిందట. అప్పుడు ఆమె బంధువులు ఆమె బ్రతికినట్లు గ్రహించి వెంటనే డాక్టరు ధర్మలింగాచారి గారికి ఫోన్ చేయడము జరిగింది. పదిహేను రోజులు గడచిన తర్వాత ఆమెను డాక్టరుగారి దగ్గరకు తీసుక రావడము జరిగింది. అప్పుడు డాక్టరు నీవు చనిపోయి మూడురోజులు అట్లే ఉన్నావు కదా! అప్పుడు నీకు యమభటులుగానీ, యమలోకముగానీ ఏమైనా కనిపించారా అని అడిగాడు. దానికి ఆమె నాకు ఏమీ కనిపించలేదు అని

చెప్పిందట. ఈ సంఘటన కూడా ఒక డాక్టరు సమక్షములో రెండు సంవత్సరముల క్రిందట జరిగినది. అందువలన దీనిని కూడ ఎవరూ కాదనుటకుగానీ, మూఢనమ్మకమనుటకు గానీ వీలులేదు.

వందసంవత్సరముల క్రితము మాస్టర్ సి.వి.వి.రామన్‌గారు కోయంబత్తూరులో దత్తు తల్లిని బ్రతికించినట్లు సమాచారముండినా ఆయన ఎలా బ్రతికించాడో పూర్తిగా తెలియదు. అయితే 1993వ సంవత్సరములో మంచు నీటి సముద్రములో మునిగి చనిపోయిన వ్యక్తిని ఐదు గంటల తర్వాత డాక్టర్లు బ్రతికించగలిగారు. అతనికి వైద్యము చేసి బ్రతికించారని తెలిసింది. సంవత్సరము క్రిందట జమ్ముకాశ్మీరులో చనిపోయిన అబ్దుల్ అజీజ్ మూడు రోజుల తర్వాత వైద్యము లేకుండగనే లేచాడు. విశాఖ జిల్లా శృంగవరపుకోట సమీపములో జరిగిన సంఘటనలో కూడా చనిపోయిన సముద్రమ్మ ఏ వైద్యము లేకుండా మూడు రోజుల తర్వాత లేవడము జరిగింది. శ్రీకృష్ణుడు, ఏసు ఉన్న వేల సంవత్సరములప్పుడుగానీ, ప్రస్తుత కాలములోగానీ, మధ్య కాలములోగానీ ఎందరో తాత్కాలిక మరణమును పొందడమూ, తిరిగి లేవడమూ జరిగింది. తాత్కాలిక మరణ విషయమును నేటి కాలములో మనము గుర్తించలేక పోయినప్పటికీ, ఆ మూడవ మరణమంటూ ఒకటున్నదని తెలియుచున్నది. ఇప్పటి కాలములో తాత్కాలిక మరణము యొక్క విషయము తెలియకున్నవారు కూడా, మనిషి చనిపోయినపుడు అతని శవమును అంత్యక్రియలకు తీసుకవెళ్ళే సమయములో, దింపుడు కల్లమువద్ద శవమును దింపి అతనేమైనా బ్రతికి ఉన్నాడేమోనని, ముఖానికి కప్పియున్న గుడ్డను తీసి చూడడము జరుగు చున్నది. అంతేకాక చనిపోయిన వ్యక్తి యొక్క పేరును పెట్టి పిలువడమూ, చనిపోయిన వ్యక్తిని తట్టి పిలువడమూ జరుగుచున్నది. ఈ కాలములో

కూడ కొన్ని ప్రాంతములలో దింపుడు కల్లము యొక్క సాంప్రదాయము ఉండడమేకాక తట్టడమూ పిలువడమూ ఉన్నది. కొన్ని ప్రాంతములలో ఇందూ సాంప్రదాయములు అడుగంటిపోయి దింపుడు కల్లము యొక్క ఆచారము లేకుండాపోయినది. **దింపుడు కల్లము యొక్క ఆచారము జ్ఞాన సంబంధమైనప్పటికీ అది నేడు లేకుండా పోయింది.** నలుగురు మనుషులు పాడెమీద మోసుకపోవడము మానివేసి, నాలుగు చక్రముల మోటారు వాహనము మీద చనిపోయిన వారిని స్మశానానికి తీసుకపోవడము జరుగుచున్నది.

పూర్వము తాత్కాలిక మరణము యొక్క వివరము మనుషులందరికీ తెలియనప్పటికీ, మూడవ మరణమైన తాత్కాలిక మరణమును పొందిన వారిని కూడా మనుషులు తెలియక స్మశానానికి తీసుకపోవుదురనీ, అటువంటి మరణమును పొందినవారు ఎవరైనా ఉంటే, దింపుడు కల్లము వద్దయినా వారు తిరిగి లేచుటకు అవకాశముందనీ, పెద్దలు దింపుడు కల్లము వద్ద శవాన్ని గుడ్డ తీసి చూడమనీ, పిలువమనీ చెప్పుట వలన ప్రజలు ఆ విధముగనే చేయుచున్నారు. దింపుడు కల్లము వద్ద గుడ్డతీసి చూచినపుడు మరణించిన వారు ఎవరో ఒక్కరు బ్రతికివున్నట్లు తెలియ బడింది. అంతేకాకుండ పేరుతో పిలిచినపుడు చనిపోయిన వాడు నిద్రనుండి లేచినట్లు లేచి పలకడము జరిగినది. ఇంకా కొందరు గట్టిగా తట్టినపుడు కూడా లేచినవారున్నారు. అ విధముగా పూర్వము కొన్ని వందలమందికి ఒక్కడైనా దింపుడు కల్లమువద్ద తిరిగి బ్రతికెడివారట. అందువలన దింపుడు కల్లమువద్ద ఇప్పటికీ శవము యొక్క ముఖమును గుడ్డతీసి చూడడము, తట్టి పిలువడము జరుగుచున్నది. తాత్కాలిక మరణము యొక్క వివరము తెలియనివారు, చనిపోయిన వాడు బ్రతికియుంటాడేమో అని తెలియక

శవమును తట్టి పిలువడములేదు. కొందరు దింపుడు కల్లమువద్ద పాడెను దించి, పాడెను మోయు మనుషులు ముందువారు వెనక్కీ, వెనుకవారు ముందుకు మారుచున్నారు తప్ప, దింపుడు కల్లము యొక్క అర్థముగానీ, ఆచారముగానీ, తెలియకుండా పోయినది. అందువలన చనిపోయిన వానిని గట్టిగా తట్టి పిలిచి బ్రతుకుతాడేమోనను ప్రయత్నము చేయడముగానీ లేదు.

పూర్వము తాత్కాలిక మరణముతో చనిపోయిన వారు ఎందరో దింపుడు కల్లమువద్ద దించినపుడు బ్రతికిన వారు కలరు. దింపుడు కల్లము వద్ద చనిపోయినవాడు బ్రతుకుతాడేమోనను ఆశతో గట్టి ప్రయత్నముగా తట్టడడమూ, పిలువడము చేసెడివారు. అందువలన తాత్కాలిక మరణమును పొందినవారు అందరూ కాకపోయినా కొందరైనా బ్రతికెడి వారు. వైద్య అవసరమున్న వారు మాత్రము బ్రతకలేదు. వారికి కూడ వైద్యమును చేసివుంటే బ్రతికేవారే. ఎరుక బాగా ఉన్నవారందరు వైద్య అవసరము లేకున్నా దింపుడు కల్లమువద్ద పిలువడమూ, తట్టడమూ వలన లేవగలిగారు. చనిపోయినవారు దింపుడు కల్లమువద్ద బ్రతకడమునకు కారణమేమిటి? అని కొందరికి ప్రశ్నరావచ్చునని, ఆ దినములలో తెలిసిన పెద్దలు చనిపోయి తిరిగి బ్రతికిన వారిని గురించి ఒక కథను అల్లి చెప్పడము జరిగినది. అలా పెద్దలు చెప్పిన కథ వలన అందరూ ఒక అవగాహనకొచ్చి చనిపోయిన వారందరూ నిజముగా చనిపోలేదనీ, వారు కొంతసేపు మాత్రమే శరీరమును వదలి బయటికి పోయారనీ, అలా పోయిన వారు రాలేక ఎక్కడో చిక్కుకొని పోవడము వలన శరీరము చనిపోయినట్లు కనిపిస్తున్నదనీ, ఆ శరీరము యొక్క జీవుడు తాను చిక్కుకొన్న స్థలమునుండి వచ్చినపుడు తిరిగి తన శరీరములోనికి వచ్చుననీ అనుకోవడము జరిగింది. ఇందులో ఏమాత్రము సత్యము లేకపోయినా అసత్య కథ వలనైనా మనిషి పూర్తి

చనిపోకుండా, జీవుడు వేరు జన్మకు పోకుండా, ఎక్కడో కొంతసేపుండి తర్వాత వచ్చి అదే శరీరములో బ్రతుకునను సత్యమైనా తెలిసింది. అలాంటి కథ వలన చనిపోయిన వాడు బ్రతుకునేమోనని దింపుడు కల్లములో అందరూ చూచెడివారు. ప్రస్తుత కాలములో పూర్వము పెద్దలు చెప్పిన కథగానీ, దింపుడు కల్లములో పిలిచే విషయముగానీ తెలియకుండాపోయినది.

పూర్వము చనిపోయిన వారిలో అందరూ పూర్తిగా చనిపోలేదనీ, కొందరు తిరిగి బ్రతుకుదురనీ ప్రజలనందరినీ నమ్మించిన కథ ఏమిటో, ప్రజలకు అర్థమగుటకు పెద్దలు తెలివిగా ఎలా అల్లి చెప్పారో తెలుసు కొందాము. మనిషి శరీరములో జీవాత్మ ప్రత్యేకముగా ఉంటుందనీ, అది మనిషి నిద్రపోయేటప్పుడు బయటికి పోయి వస్తుంటుందనీ, అలా బయటికి పోయిన జీవుడు తిరిగి తన శరీరమును చేరుచుండునని తెలిపాడు. జీవుడు తన శరీరమును వదలి పోవునపుడు శరీరము యొక్క బొడ్డు ద్వారా బయటికి వచ్చి, బొడ్డునుండి ఒక కనిపించని తీగలాంటి దానిని తనకు కరిపించుకొని ఎంత దూరమైనా పోగలడనీ, తిరిగి వచ్చునపుడు ఆ తీగను ఆధారము చేసుకొని తన శరీరమును గుర్తించి, శరీరములోనికి వచ్చి చేరుననీ తెలిపారు. అలాంటి ఒక సంఘటనను గురించి పెద్దలు ఇలా చెప్పారు. ఒకడు తాను రాత్రి పడుకోబోవు ముందు దాహము వేస్తూవుంటే నీళ్ళను త్రాగి పడుకోవాలనుకొన్నాడట. కానీ తాను లేచి పోయి నీళ్ళను త్రాగక ముందే నిద్రలోనికి పోయాడట. నిద్రపోయే ముందు నీళ్ళను త్రాగాలనుకొన్న దానివలన మధ్యరాత్రిలో జీవుడు శరీరమును వదలి బొడ్డుద్వారా బయటికి వచ్చి, తన ఇంటిలోనే ఒక బిందెలో దూరి నీటిని త్రాగుచుండెననీ, అదే సమయములో ఏదో శబ్దమైందని లేచిన అతని భార్య, వంటరూములోనికి వచ్చి బిందెమీద మూత లేకుండడమును చూచి, వెంటనే ప్రక్కనున్న ప్లేటును

బిందెమీద మూసి తాను పోయి పడుకొని నిద్రపోయిందట. అప్పుడు బిందెలో నీటిని త్రాగుచున్న జీవుడు బిందెమీద ప్లేటు మూసివుండడము వలన బయటికి రాలేక బిందెలోనే ఉండిపోయాడట. అలా బిందెలో ఇరుక్కుపోయిన జీవుడు శరీరములో లేని దానివలన, ఉదయము లేచిన తర్వాత అందరూ అతని శరీరమును చూచి చనిపోయాడని అనుకొన్నారు. ఇంటిలోనివారూ బయటివారూ అందరూ జీవుడు లేని శరీరమును చూచి చనిపోయాడని నిర్ధారించుకొన్నారు. ఆ దినము ఇంటి యజమాని చనిపోయిన దానివలన ఇంటిలో వంటకూడా చేయలేదు. అందువలన బిందెమీద మూతను ఎవరూ తీయలేదట. చివరకు సాయంకాలము బంధువులు శరీరమును పూడ్చిపెట్టుటకు పాడెకట్టి, పాడెమీద శవమును కట్టుకొని స్మశానానికి మోసుకపోయారు.

శవమును ఎత్తి పంపిన తర్వాత ఇంటిలో ఉండిపోయిన ఒక ముసలివాడు నీళ్ళను త్రాగుటకు లోపలికి పోయి బిందెమీద మూత తీశాడు. అప్పుడు వెంటనే బయటికి వచ్చిన జీవుడు తన శరీరము ఇంటిలో లేనిది చూచి ఏమి జరిగిందో అర్థము చేసుకొని, తన బొడ్డుత్రాడు ఆధారముగా తొందరగా తన శరీరమువద్దకు రాగలిగాడు. పాడెమీదవున్న శరీరములోనికి చేరుకోగలిగాడు. అప్పుడు శరీరము తాళ్ళతో పాడెను కదలకుండా కట్టి వేయబడివున్నది. అందువలన ఎటూ కదిలే దానికీ లేదు. అంతేకాక నోటినిండా బియ్యము పోయబడివున్నాయి. అందువలన గట్టిగా అరిచే దానికీ వీలులేదు. అంతలోనే దింపుడు కల్లము రానేవచ్చింది. అందరూ శవమును దించి ముఖము మీద గుడ్డను తీసి చూచారు. అప్పుడా శరీరము కళ్ళు తెరిచివుండడమును చూచి, అతడు బ్రతికాడని గ్రహించి, అతని కట్లు విప్పివేశారు. దింపుడు కల్లములో కొందరు బ్రతుకగలరని పెద్దలు

చెప్పిన మాట సత్యమైందని అందరూ అనుకొన్నారట. ఇటువంటి సంఘటన జరగడము అసత్యముకాదు. ఎందుకనగా అది తాత్కాలిక మరణమని మనకు తెలిసిపోయింది. కానీ తాత్కాలిక మరణము యొక్క పూర్తి వివరము తెలిస్తే అది జీవునికి నిద్రలాంటిదనీ, శరీరమునకు మరణములాంటిదనీ తెలియుచున్నది. ఏది ఏమైనా ఇటువంటి కథ వలన దింపుడు కల్లములో శవమును చూడవలెననీ, ఒకవేళ మనిషి పూర్తి చనిపోకపోతే అక్కడైనా బ్రతుకుననీ అర్థమైనది. పై కథలో చెప్పినట్లు నిద్రపోయినపుడు జీవుడు తన అవసరనిమిత్తము శరీరమును వదలిపోవుననుట పూర్తి అసత్యము.

ఇప్పటి కాలములో పూర్వకాలము మనుషులకంటే పూర్తి అజ్ఞానులుగా మారిన మనుషులున్నారు. పూర్వము నిరక్షరాస్యులు ఎక్కువగా ఉండినప్పటికీ ఆధ్యాత్మికము మీద ఎక్కువ పట్టువుండెడిది. అందువలన జననములోను, మరణములోను మనుషులు పొరపాటు పడెడివారు కాదు. నేటికాలములో **జన్మసిద్ధాంతమునూ, మరణ సిద్ధాంతమునూ** తెలియనివారు ఉండుట వలన, మనిషి పుట్టినపుడు శిశుశరీరములోనికి జీవుడు చేరకముందే ఆ శిశువు గర్భములోనే చనిపోయిందని పొరపాటు పడి, ఊపిరిరాని శిశు శరీరమును, జీవుడు శరీరములోనికి ప్రవేశించకముందే పూడ్చి పెట్టు చున్నారు. **ఇలా దేశమంతటిలో ఒక సంవత్సరమునకు కొన్ని వేలమందిని జన్మించక ముందే చంపివేస్తున్నాము.** అట్లే మనిషి మరణించినపుడు అతడు పూర్తి మరణించకనే, జీవుడు శరీరమును వదలి పోకముందే, ఊపిరిపోని శరీరమును చచ్చిపోయిందని భ్రమించి, డాక్టర్లు సహితము పొరపాటు పడి, చనిపోయినట్లు నిర్ధారించుచున్నారు. అటువంటి వానిని వాస్తవముగా వాడు చనిపోకపోయినా పూడ్చిపెట్టుచున్నారు. మరణ విషయము పూర్తి తెలియనివారు ఎందరో, చనిపోయినట్లు కనిపించిన వారందరినీ మరణించా

డని నమ్ముచున్నారు. చనిపోయిన వారిలో కూడా పూర్తి చనిపోనివారున్నారని తెలియక, ఒక సంవత్సరమునకు దేశము మొత్తములో కొన్ని వేలమందిని పూడ్చిపెట్టి నిజముగా చంపివేయుచున్నాము. **శిశువు పుట్టగానే ఏడ్వలేదని కడుపులోనే చనిపోయిందనడము విజ్ఞానము కాదు, అజ్ఞానము. అలాగే మనిషికి ఊపిరిలేనంత మాత్రమున శరీరమును వదలి జీవుడు పోయాడను కోవడము కూడా అజ్ఞానమే అగును.** ఊపిరి (ప్రాణము) లేనంత మాత్రమున శరీరము పుట్టిన సమయములోగానీ, శరీరము చచ్చిన సమయములోగానీ జీవుని విషయము తెలియనిదే తొందరగా నిర్ధారించ కూడదు.

## తాత్కాలిక మరణమును తెలిసి పొందవచ్చునా?

తాత్కాలిక మరణము కర్మానుసారము లభించునదని చెప్పు కొన్నాము. అది కొందరికి తెలిసీ లభించవచ్చును, కొందరికి తెలియకనే లభించవచ్చును. తెలిసి లభించినా, తెలియక లభించినా అది ముందే కర్మలో నిర్ణయింపబడి ఉండును. మూడువందల సంవత్సరముల క్రితము ఆంధ్రరాష్ట్రములోనే, కడపజిల్లాలో కందిమల్లాయిపల్లె అను గ్రామములో పోతులూరి వీరబ్రహ్మముగారు ఉండెడివారు. ఆయన గొప్ప జ్ఞాని, అంతేకాక ఆయన బ్రహ్మయోగమును తెలిసిన యోగి అని చెప్పవచ్చును. యోగములు రెండు రకములు కాగా, అందులో బ్రహ్మయోగము ఒకటి. బ్రహ్మ యోగములో ఆత్మ చైతన్యము పని చేయదని చెప్పుకొన్నాము. బ్రహ్మ యోగములోనున్న మనిషి శరీరములో ఏమి జరుగుచున్నదో వీరబ్రహ్మము

గారు తన తత్త్వములో వివరించాడు. ఆ తత్త్వము యొక్క వివరమును చూస్తే బ్రహ్మయోగి శరీరములో జరుగు మార్పులన్నీ తెలిసిపోగలవు. బ్రహ్మయోగములో బయటికి కనిపించు శ్వాస లేకుండా పోవును, అలాగే శరీరములోపల కనిపించని చైతన్యము కూడా ఒక్కచోట నిలిచిపోవును. తాత్కాలిక మరణములో మొదట శ్వాసను చూచి, దాని తర్వాత శరీరములోని కదలికలను చూస్తాము. అవి రెండూ లేకపోతే మరణ విషయమును పూర్తిగా తెలిసినవారు, ఇది తాత్కాలిక మరణమని గుర్తించగలుగుతారు. మరణ విషయము తెలియనివాడు నిజముగా చనిపోయాడని పొరపాటుపడును. ముక్కులోని శ్వాస, శరీరములోని చైతన్యము లేనపుడు, మనిషి ఏదో ఒక మరణమును పొందివుండునని అనుకోవడము సహజమే. కానీ బ్రహ్మ యోగము కూడా దాదాపు మరణములాంటిదే. బ్రహ్మయోగములో కూడా శ్వాస ఆగిపోయి, గుండె నిలిచిపోయి ఉండును. ఇంతకు ముందు మరణము, తాత్కాలిక మరణములను గురించి పూర్తిగా తెలుసుకొన్నాము. ఇపుడు తాత్కాలిక మరణముతో సమానమైన బ్రహ్మయోగమును గురించి తెలుసుకొందాము.

యోగములు రెండు రకములని చెప్పుకొన్నాము కదా! అందులో కర్మ యోగమనునది శరీరములోని అహము మీద ఆధారపడి ఉంటుంది. ఎప్పుడు అహము పని చేయదో అప్పుడు మనిషి కర్మయోగమును పొందినట్లే అగును. అహము తనకు తాను పని చేయకుండా ఎప్పటికీ నిలిచిపోదు. అందువలన అహము పని చేయకుండా పోవాలంటే మనిషి ప్రయత్నము చేసి అహమును నిలపగలగాలి. అలా మనిషి చేయు ప్రయత్నమును యోగసాధన అంటున్నాము. తన ప్రయత్నము నెరవేరి అహము పని చేయడము ఆగిపోతే, అప్పుడు అది కర్మయోగము అగును. దానిని

సాధించిన వాడు కర్మయోగి అగును. అలాగే బ్రహ్మయోగమనునది శరీరములోని మనస్సు మీద ఆధారపడి ఉంటుంది. ఎప్పుడు మనస్సు పని చేయదో అప్పుడు మనిషి బ్రహ్మయోగమును పొందినట్లే అగును. శరీరములోని మనస్సు కూడా ఎవరిలోనూ తనకుతానుగా ఎప్పటికీ నిలిచిపోదు. ఇక్కడ కొంత బాగా యోచించి తెలుసుకోవలసినది ఏమనగా! అహముగానీ, మనస్సుగానీ రెండూ బలమైనవే! ఈ రెండూ తమకు తాముగా ఎప్పుడూ నిలిచిపోవు. అహమునూ, మనస్సునూ వివరముగా తెలుసు కొనుటకు ముందు ఒక ఉదాహరణను తీసుకొని చూస్తాము.

ఒక ఇంటి యజమాని, రెండు కుక్క పిల్లలను చిన్నప్పటినుండి పాలు పోసి పెంచాడు. చిన్నతనము నుండి తమను పెంచిన యజమాని మీద ఆ రెండు కుక్కలు ఎంతో విశ్వాసముతో ఉన్నాయి. ఆ ఇంటి యజమాని రెండు కుక్కలకు లంబు, జంబు అని రెండు పేర్లు పెట్టాడు. లంబు, జంబు అను రెండు కుక్కలు ఒకే ఇంటిలో పెరిగినా, అవి రెండూ వేరువేరు స్వభావములు కల్గియుండేవి. అవి ఎట్లుండినా తమ యజమాని మీద ఎంతో గౌరవముతో, విశ్వాసముతో ఉండేవి. అందువలన ఇంటి యజమాని ఏమి చెప్పినా అతని మాట వినేవి. యజమాని కూర్చోమంటే కూర్చొనేవి, లేవమంటే లేచేవి. ఒకరోజు ఎవరో గుర్తు తెలియని వ్యక్తి ఇంటిలోనికి రావాలని ప్రయత్నము చేయగా, వానిని దొంగగా గుర్తించిన ఆ కుక్కలు వాని మీద దాడిచేసి, వానిని తరిమివేశాయి. తామున్న ఇంటికి రెండు ద్వారములున్నాయి. కావున ఒక్కొక్క ద్వారమువద్ద ఒక్కొక్క కుక్క ఉండేది. ముందు ద్వారము వద్దనున్న లంబు అను కుక్క అటువైపు ఎవరినీ రానిచ్చేది కాదు. అలాగే వెనుకవైపు ద్వారము వద్దనున్న జంబు కూడా తన ద్వారమువద్దకు ఎవరినీ రానిచ్చేది కాదు. ఆ ఇంటి యజమానికి తన

కుక్కలు ఎంతో బాగా పని చేయుచున్నవని తెలుసు. తన కుక్కలను రాత్రి పూట మాత్రము కాపలాకు ఉంచి, పగటి పూట నిద్రపోయేటట్లు వాటికొరకు ప్రత్యేకముగా చేయించిన బోనులలోనికి పంపేవాడు. తమ యజమాని మాటను వినే కుక్కలు రెండూ, యజమాని చెప్పినట్లు రాత్రిపూట ఇంటికి రెండువైపులా కాపలా ఉంటూ పగలు బోనుల్లోనికి పోయి నిద్రించేవి.

తమ యజమాని తమవద్దకు ఎప్పుడు వచ్చినా అవి గుర్తించేవి. అట్లున్నపుడు, ఒకరోజు ఒక దొంగ ఆ ఇంటి యజమానివలె వేషము ధరించి, ఆ ఇంటిలోనికి పోయి దొంగతనము చేయాలనుకొన్నాడు. ఇంటిలోని సొమ్ములనన్నింటిని తన సొంతము చేసుకోవాలనుకొన్నాడు. అలా అనుకొని ఒక పథకము ప్రకారము, దొంగ ఆ ఇంటి ముందు ద్వారమువద్దకు పోగానే లంబు అను కుక్క, దొంగను గుర్తించి మొరగను మొదలు పెట్టింది. అప్పుడు నేను ఇంటి యజమానినేనని కుక్కను నమ్మించుటకు ప్రయత్నించాడు. అయినప్పటికీ ఆ కుక్క, నీవు మా యజమాని కాదన్నట్లు అతని మీదికి దాడి చేయడానికి వచ్చింది. అప్పుడు ఆ దొంగ వెనుకవైపు ద్వారము వద్దకు పోయాడు. అక్కడ జంబు అను కుక్క కాపలా ఉండుట వలన, దొంగ అక్కడ కూడా యజమానివలె నటించి లోపలికి పోవాలనుకొన్నాడు. అయినా ఆ కుక్క కూడా అతనిని యజమాని కాదనీ దొంగ అనీ గుర్తించగలిగింది. వెంటనే మొరిగి దొంగను తరిమివేసింది.

దీనినిబట్టి చూస్తే ఆ కుక్కలు రెండూ యజమాని మాటను తప్ప ఎవరి మాట వినవని తెలిసిపోయింది. అదే విధముగా శరీరమను ఇంటిలో, ఆత్మయను యజమాని మాటవిను లంబు, జంబు అను రెండు కుక్కలవలే

మనస్సు, అహము అనునవి కలవు. కుక్కలు యజమాని మాటను మాత్రము వినినట్లు, మనస్సు, అహము అనునవి ఆత్మ మాట మాత్రమే వినును. దొంగ యజమానివలె నమ్మించినా, ఏమాత్రము కుక్కలు దొంగమాట వినలేదు. అలాగే దొంగవలెనున్న జీవుడు మనస్సు, అహములను యజమాని అయిన ఆత్మవలె నమ్మించాలని చూచినా కుదరలేదు. అలాగే మనస్సు, అహములను జీవుడు లొంగదీసుకోవాలని చూచినా, ఆత్మ ఆధీనములోనున్న మనస్సు, అహము జీవుని మాట వినలేదని తెలియు చున్నది. ఇంటి యజమాని కుక్కలకు రాత్రి పనిని పెట్టి, పగలు నిద్రించునట్లు చేశాడు. అవి అలాగే చేసినట్లు, శరీరమను ఇంటిలో అహము, మనస్సు అను వాటికి ఆత్మ పగలు పనినిపెట్టి, రాత్రి నిద్రించునట్లు చేసినది. అదే విధముగా మన శరీరములో మనస్సు, అహమూ రెండూ ఆత్మ చెప్పినట్లు వినుచున్నవి. మెలకువలో అహము, మనస్సు పని చేయుచుండగా, నిద్రలో అహము, మనస్సు రెండు విశ్రాంతి తీసుకొంటున్నవి. **పగలు జ్ఞప్తిలో అహము పనిచేయకపోతే కర్మయోగమగును. అదే విధముగా జ్ఞాపకముగా ఉండి మనస్సు పని చేయకపోతే బ్రహ్మయోమగును.** యజమాని లంబు, జంబు అను కుక్కలను రాత్రి కాపలా ఉండునట్లు నియమించాడు కదా! అదే విధముగా ఆత్మ మనస్సుకు, అహమునకు పగలు పూట పని చేయునట్లు నియమించినది కదా! ఒకవేళ యజమాని నియమించినట్లు కాపలా ఉండక దొంగమాట విని, తమ పనిని సక్రమముగా చేయకపోతే, అప్పుడు దొంగతనము జరిగిపోవును. కుక్కలు దొంగమాట వినినట్లగును. అదే విధముగా ఆత్మ మాటను విని, ఆత్మ చెప్పినట్లు, చేయు మనస్సు మెలకువ లోనే, ఆత్మ చెప్పినట్లు తన పనిని తాను చేయక నిలచిపోతే జీవాత్మ మాట వినినట్లగును. కుక్క పనిచేయనపుడు దొంగ దొంగతనమును

చేసినట్లు, మనస్సు పనిచేయనపుడు జీవాత్మ, ఆత్మ సొమ్మును (ఆత్మ ధనమును) దోచుకొనును. అప్పుడది యోగమగును. మెలకువలో మనస్సు పని చేయకపోయినపుడు బ్రహ్మయోగమగును. అలాగే ఎరుకలో అహము పని చేయకపోతే కర్మయోగమగును.

ఆత్మ అధిపతిగానున్న శరీరములో పని చేయుచున్న మనో అహములు రెండూ నిద్రలో పని చేయకపోవడము, మెలకువగానున్నపుడు పూర్తిగా పని చేయడము వాటి యొక్క ప్రకృతి ధర్మము. అయితే మెలకువలో పని చేయకుండా పోవడము మనస్సుకు, అహమునకు పూర్తిగా అధర్మ మగును. మనస్సు, అహము ప్రకృతి జనితమైనవి కావున మనస్సుగానీ, అహముగానీ తమ పనిని తాము చేయకుండా పోవడము ప్రకృతికి అధర్మమగును. పరమాత్మకు ధర్మమగును. ఆత్మ అధిపతిగా ఉండి, ప్రకృతి ధర్మములతో కూడుకొన్న ప్రకృతిచే తయారైన శరీరమునకు శక్తి నిచ్చుచున్నది. దీనినిబట్టి మనస్సు పని చేయుట మాయకు ధర్మమగును. అట్లే అహము పనిచేయుట కూడా మాయకు ధర్మమగును, దైవమునకు అధర్మమగును. ఎరుకగా ఉన్నపుడు మనస్సు పని చేయకపోతే అది దైవమునకు ధర్మమగును, మాయకు అధర్మమగును. ఎరుకలో మనస్సు పని చేయకపోతే దైవధర్మము ప్రకారము అది బ్రహ్మయోగమగును. అట్లే ఎరుకలో అహము పని చేయకపోతే దైవధర్మము ప్రకారము కర్మయోగ మగును. ప్రకృతి జనిత శరీరములోని మనస్సు, అహములనుబట్టి బ్రహ్మ, కర్మయోగములు కలవని తెలియుచున్నది.

బ్రహ్మయోగమును గురించి బాగా అర్థము కావాలంటే పై ఉదాహరణను బాగా అర్థము చేసుకోవాలి. కుక్కను మంచిగా మచ్చిక

చేసుకోవచ్చూ, లేకపోతే బలవంతముగా లొంగదీసుకోవచ్చును. కుక్కకు తినే రుచికరమైన ఆహారమును అందించడము వలన అది మచ్చికై మొరగకుండును. బలవంతమైన రెండవ విధానములో చాటుగా కుక్కను పట్టుకొని దాని మూతిని కట్టివేయడము. అలా చేయుట వలన అది నోరు తెరవలేదు, మొరగలేదు. మొదటి పద్ధతిలో మనస్సును ప్రయత్నము చేసి పని చేయకుండా నిలిచిపోవునట్లు చేయడమును యోగసాధన అంటారు. అలా చలించే మనస్సు చలించకుండా పోవాలంటే, ఎంతో కాలము దానిని పని చేయకుండునట్లు అలవాటు చేసుకోవాలి. దీనికి చాలా కాలము పట్టును. ఇక రెండవ విధానములో మనస్సును బలవంతముగా ఆపివేయడము ఒక రకముగా ఇది కొంచెము కష్టమైనదీ, అపాయకరమైనదీ, అయినప్పటికీ దీనిని తొందరగా సాధించవచ్చును. అరుదుగా కొందరు ఈ రెండవ పద్ధతినే ఆచరించారు. అటువంటి వారు ఎలా ఆ పద్ధతిని అవలంబించుచున్నారో వారికి తెలిసిన సూత్రమేమిటో చూస్తాము. మనస్సు నిలిచిపోవడమే బ్రహ్మయోగము అగును. మనస్సు నిలిచిపోయినపుడు దానికి అనుసంధానమైన శ్వాస కూడా నిలిచిపోవును. శ్వాస నిలిచిపోవుట వలన ఆ శరీరము, బయటికి చనిపోయిన శవములాగ కనిపించును. బ్రహ్మయోగములోనున్న వానికి బయట ప్రపంచముతో సంబంధము తెగిపోయి వుండును. అటువంటి వాడు ఆసనములో కూర్చొని ఉండుట వలనా, అతను యోగము చేయు యోగి అని అందరికీ తెలిసివుండుట వలనా, అతనికి శ్వాస ఆడకుండినా, అతనిని యోగములో ఉన్నాడనుకొందురు. కానీ చనిపోయాడని ఎవరూ అనుకోరు.

బ్రహ్మయోగములో లోపల మనస్సు నిలిచిపోవుట వలన బయట శ్వాస నిలిచిపోవుచున్నది. అదే తాత్కాలిక మరణములో ముందు బయట

శ్వాస నిలిచిపోవుట వలన తర్వాత లోపలి మనస్సు నిలిచిపోవుచున్నది. ఇటు బ్రహ్మయోగములోగానీ, అటు తాత్కాలిక మరణములోగానీ జీవుడు శరీరమును వదలిపోడు. అందువలన అతను సజీవముగా, ఆత్మ సమేతముగా శరీరములోనే ఉండును. **మనస్సు ముందు ఆగితే తర్వాత శ్వాస ఆగుననీ, ఒకవేళ శ్వాస ముందు ఆగితే తర్వాత మనస్సు ఆగుననీ కొందరు గ్రహించగలిగారు.** అందువలన కొందరు సాధన చేసి, శ్వాసను శరీరములోనికి పంపి నిలిపివేయుచున్నారు. శరీరము బయటికి శ్వాస వెళ్ళిపోతే అది శాశ్విత మరణమగును. శ్వాస శరీరములోనికి పోయి ఆగిపోతే అది మరణములాంటిదగును, కానీ మరణము కాదు. అట్లు మరణములాంటి దానిని తాత్కాలిక మరణము అంటున్నాము. శ్రీ పోతులూరి వీరబ్రహ్మముగారు శ్వాసను బంధించి, మనస్సును బంధించగలిగాడు. శ్వాసను శరీరములోపలనే నిలిపి వేయడమును కుంభకము అంటారు. శ్వాసను కుంభించడము అంటారు. అలా శ్వాసను బయటికి రాకుండా బంధించడమును ప్రాణాయామము అని కూడా అంటారు. ఏది ఏమైనా ఎరుకలోనున్న మనస్సును పని చేయకుండా బంధించగలిగినపుడు, బ్రహ్మ విద్యాశాస్త్రరీత్యా అది బ్రహ్మయోగమగును. పూర్వము కొందరు బ్రహ్మ యోగమును మనస్సు ద్వారా సాధించినవారున్నారు. మరికొందరు శ్వాస ద్వారా సాధించినవారున్నారు. ఇదంతా జ్ఞానము తెలిసి చేసినపుడు, చేసినవాడు యోగి అవుతాడు, అతనికి యోగశక్తి వస్తుంది. దైవజ్ఞానము లేకుండా శ్వాసను కుంభించు సాధన చేసి శ్వాసను ఒక నెల, ఒక సంవత్సరము నిలుపగలవారు కూడా కలరు. అటువంటివారు శ్వాస నిలిచినంత కాలము నిద్రలోనికి పోయి, తాత్కాలిక మరణమును పొందుదురు, కానీ ఎరుకతో ఉండిన యోగమును పొందలేరు.

వీరబ్రహ్మముగారు దైవజ్ఞానమును తెలిసిన బ్రహ్మయోగి. ఆయన లోపలి మనస్సును జయించక, బయటి శ్వాసను లోపలనే బంధించి, మనస్సును స్వాధీనములోనికి తెచ్చుకొని, కొన్ని సంవత్సరములు సమాధి లోనే ఎరుకగానున్న బ్రహ్మయోగి. బ్రహ్మముగారు ప్రాణాయామము ద్వారా బ్రతికివుండవచ్చునని ప్రజలకు తెలుపు నిమిత్తము, దాదాపు మూడు వందల సంవత్సరముల క్రితమే భూసమాధిలో సజీవముగా కూర్చొన్నాడు. ఆయనను భూమిలో సమాధి చేసినప్పటికీ ఆయన చనిపోలేదు. ఆ విషయమును, నేను చనిపోను అని ముందే చెప్పి సమాధిలోనికి పోయాడు. ఆయన శ్వాసను కుంభించి నిలుపు విద్యను బ్రహ్మజ్ఞాన సమేతముగా నేర్చు కున్నాడు. కావున ఆయన తాత్కాలిక మరణమును పొందినా అది బ్రహ్మ యోగమైనది. బ్రహ్మయోగము కాని తాత్కాలిక మరణమును, వారికి తెలియ కుండానే చాలామంది పొందినారని ముందే తెలుసుకొన్నాము. అటువంటి తాత్కాలిక మరణములో ముందు మనస్సు నిలిచిపోయి తర్వాత శ్వాస లోపల నిలిచిపోయినది. కొందరు అదే పనిగా సాధన చేసి, శ్వాసను బంధించగలిగి, బయటికి అందరూ చూచునట్లు చనిపోయి, లోపల మాత్రము తాత్కాలిక మరణమును పొంది, తర్వాత కొంత కాలమునకు నిద్రనుండి లేచినట్లు లేవగలిగి, చచ్చిపోయి తిరిగి కొంత కాలమునకు బ్రతికినట్లు కనిపించుచున్నారు. అదే పనిని పొట్టకూటి కొరకు ఒక బీదవాడు చేస్తే దానిని మనము గారడివిద్య అంటున్నాము. అన్ని స్థోమతలు కల్గి, ఆర్థిక స్థోమత కూడా కల్గిన మనిషి చేస్తే దానిని మహత్యము అంటున్నాము, అతనిని దైవ సమానముగా పోల్చుచున్నాము.

అమెరికా దేశములో రెజ్లింగ్ (మల్లయుద్ధము) లేక కుస్తీ అను ఆట గలదు. అందులో పాల్గొను వారందరూ శరీరధారుఢ్యమున్న వారే ఉందురు. ఒక్కొక్కపుడు ఆ ఆటలో చనిపోవునంత పరిస్థితి కూడా ఏర్పడ గలదు. మేము చూడగా, అమెరికాలో అండర్‌టేకర్ అను 6.9 ఇంచులు ఎత్తుగల మనిషి 1984వ సంవత్సరమునుండి ఆ ఆటలో పాల్గొనుచున్నాడు. అతను ఆ ఆటలో ఇప్పటికి ఐదుమార్లు చనిపోవడము జరిగినది. అతనిని పెట్టెలో వేసి, పెట్టెతో సహా భూమిలో పూడ్చిపెట్టడమూ జరిగినది. అయినా అతను 40 దినములకు తిరిగి బ్రతికివచ్చాడు. అతనిని అందరూ డెడ్‌మ్యాన్ (చచ్చిన మనిషి) అని అంటారు. ఈ సంవత్సరము అనగా 21-02-2011 దినమున నెలన్నర క్రితము చనిపోయిన ఆ వ్యక్తి తిరిగి లేచి రావడము జరిగినది. ఈ మారు అతనిని డెడ్‌మ్యాన్ వాకింగ్ (చనిపోయిన మనిషి నడుచుచున్నాడు) అని అక్కడున్న కొందరు బోర్డుమీద వ్రాయడము జరిగినది. ఈ విధముగా అతను తిరిగి బ్రతికిరావడము వెనుక, అందరికీ పెద్ద ఆశ్చర్యమున్నది. అయినా మేము చెప్పునదేమనగా! అతను శ్వాసను బంధించి బ్రతకగల తాత్కాలిక మరణమును సాధించగలిగాడు. అందువలన కొన్ని అపాయకర సమయములలో అతను తాత్కాలిక మరణము లోనికి పోయి, కొంతకాలము విశ్రాంతిని పొంది తిరిగి తాజాగా లేచి వస్తున్నాడు. అతను తాత్కాలిక మరణమును బ్రహ్మయోగముగా పొందుచున్నాడో లేదోగానీ అతను ఏదో ఒక శక్తిని సాధించిన వ్యక్తి అనియే చెప్పవచ్చును. తాత్కాలిక మరణమును గురించి తెలుసుకొంటే ఇంతకుముందు అర్థముకాని ఎన్నో ప్రశ్నలకు జవాబులు దొరుకును.

# తాత్కాలిక మరణము వలన ఆయుష్షు పెరుగుతుందా?

'ఆయువు' అను పదము మార్పుచెందినదై ఉన్నదనీ, **ఆయువు అను పదము మొదట వాయువు** అను పదముగా ఉండెడిదనీ, కాలక్రమమున వాయువు అను శబ్దము ఆయువు అను శబ్దముగా మారిపోయి, ఆయువు అను మాటగానే పిలువబడుచున్నది. మనిషి పుట్టుకలోనే అతడు ఎంత కాలము జీవించాలో నిర్ణయించబడుచున్నది. ప్రారబ్ధకర్మ నిర్ణయములో ప్రతి జీవరాశి ఆయుస్సు ఉండును. మనిషి యొక్క ఆయువు అతని శ్వాస మీదనే ఆధారపడి ఉండును. ఒకడు భూమిమీద ఇంతకాలము బ్రతకాలని ప్రారబ్ధ కర్మలో ఉండదు. ఒకడు ఇన్ని శ్వాసల వరకు బ్రతకాలని ఉండును. కొన్ని కోట్లు, కొన్ని లక్షలు, కొన్ని వేల శ్వాసలు జరగాలని మనిషి యొక్క జీవితము నిర్ణయింపబడి ఉండుట వలన, అతని జీవితము అతని శ్వాసలు అయిపోయే దానినిబట్టి ఉండునని పెద్దలు చెప్పెడివారు. మనిషి జీవితము అతని శ్వాసల మీద ఆధారపడినదనీ, శ్వాసలు గాలితో కూడుకొన్నవనీ, మనిషి బ్రతుకు కాలము అతని ముక్కు రంధ్రములలో చలించు వాయువు మీద ఆధారపడి ఉండుననీ అందరికీ తెలియునట్లు, మనిషికి వాయువు ముందే నిర్ణయింపబడినదనీ తెలిసిన జ్ఞానులు చెప్పెడి వారు. ముక్కు రంధ్రములలో ఆడే వాయువును చివరకు ఆయువు అనడము జరిగినది. ఒక మనిషి ఆయువు (వాయువు) ఆ మనిషి పీల్చే శ్వాసమీద ఆధారపడి ఉంటుంది. దానివలన మనిషి జీవితములో శ్వాస ఎంతో ప్రాధాన్యత చెందివున్నది. ఒక మనిషి జీవిత కాలమునకు కొలత పరిమాణముగా శ్వాస ఉండడమేకాక మనిషి జన్మలోనూ, మనిషి మరణము

లోనూ శ్వాస ముఖ్యపాత్రను పోషించుచున్నది. మనిషి శరీరములోనికి ప్రవేశించు మొదటి శ్వాస జననమనీ, మనిషి శరీరమునుండి బయటికి పోవు ఆఖరి శ్వాస మరణమనీ చెప్పుకొన్నాము. దీనినిబట్టి ఇటు మరణమును గానీ, అటు జననమునుగానీ, శ్వాసను బట్టి చెప్పవచ్చునని తెలియుచున్నది.

మనిషి జీవితములో శ్వాస ముఖ్యపాత్రను పోషించుచున్నదనీ తెలుసుకొన్న ఆధ్యాత్మికవేత్తలు, శ్వాసమీద కొంత పరిశోధన చేసి, శ్వాస వలన జీవితకాలమును పొడిగించుకోవచ్చునని కనుగొన్నారు. జీవిత కాలమునకు సరిపడు శ్వాసలు ముందే నిర్ణయింపబడి ఉండునని తెలిసిన జ్ఞానులు, శ్వాసను మార్చుకొనుట వలన జీవితకాలమును కూడా పొడిగించు కోవచ్చునని చెప్పగలిగారు. అలా చెప్పడమేకాక ముందే నిర్ణయింపబడిన జీవితకాలమును పెంచుకొని నిరూపణచేసి చూపించారు. బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము, ఆధ్యాత్మిక రంగములో చేసిన పరిశోధన వలన ఆయుష్షును పెంచుకోవడము సాధ్యమేననీ, అది కర్మ సిద్ధాంతమునకు లోబడే ఉన్నదనీ మన జ్ఞానులు తెలిపారు. పూర్వము జ్ఞానులు తెల్పిన దానినిబట్టి తర్వాత వారు ఆ విషయమును తెలుసుకోగలిగి ఆచరించి ఆయుష్షును పెంచుకోగలిగారు. ఆధ్యాత్మికము ప్రకారము ఆయుస్సును పెంచుకోవడములో తాత్కాలిక మరణము ముఖ్యపాత్రను పోషించినది. శ్రీ పోతులూరి వీరబ్రహ్మముగారు తాను జీవిత సమాధి పొంది, సమాధిలోనే దాదాపు మూడు వందల సంవత్సరములు సజీవముగా ఉండగలిగాడు. **జీవిత సమాధి అనగా జీవితమును శాసించు శ్వాసను శరీరములోనే సమాధి చేయడము అని అర్థము.** శరీరమును భూమిలో కనిపించకుండా పూడ్చి పెట్టితే అది సమాధి అవుతుంది. శరీరములో ఆడు శ్వాసను కనిపించకుండా

శరీరములోనే పూడ్చిపెట్టితే అది జీవిత సమాధి అవుతుంది. అందులో కూడా జీవుడు శరీరములోనే ఉండును. కావున దానిని సజీవ సమాధి అని కూడా అనవచ్చును. వీరబ్రహ్మముగారు పొందిన దానిని సజీవ సమాధి అనిగానీ, జీవిత సమాధి అనిగానీ అనవచ్చును.

శాలివాహన శకము ప్రారంభమునకు ముందు విక్రమార్కుడు ఉజ్జయినీ పట్టణమును రాజధానిగా చేసుకొని, కొంత రాజ్యమును పరిపాలించిన చరిత్ర మన దేశములో కలదు. విక్రమార్కునికి గల ముగ్గురు తమ్ముళ్ళలో భట్టి అను పేరుగల వ్యక్తి ఒకడుండెడివాడు. భట్టి వైశ్యజాతి స్త్రీకి పుట్టిన క్షత్రియుడు. విక్రమార్కునికి, భట్టికి తండ్రి ఒక్కడే అయిన దానివలన విక్రమార్కునికి భట్టి స్వయాన తమ్ముడగును. పరాక్రమములో విక్రమార్కుడు పేరుగాంచిన వాడుకాగా, బుద్ధి యొక్క పనితనములో భట్టి గొప్ప మేధావి. విక్రమార్కుడు మేధాశక్తిలో గొప్పవాడైన భట్టిని తన ప్రధాన మంత్రిగా పెట్టుకొన్నాడు. భట్టి విక్రమార్కులు ఇద్దరూ ఆధ్యాత్మిక చింతన కల్గినవారే అయినందున, వారు శ్వాస యొక్క రహస్యమును తెలుసు కోగలిగారు. వారి ప్రారబ్ధకర్మను బట్టి నిర్ణయింపబడిన శ్వాసలను తాత్కాలిక మరణము ద్వారా నిలిపివేయగలిగీ, వారి ఆయుష్షును పెంచుకోగలిగారు. భట్టి విక్రమార్కులు ఇద్దరూ ఆరు నెలలు మాత్రము రాజ్యమును పరిపాలించి, రాజరికపు పనులను చక్కబెట్టి, ఆరు నెలలు అడవికిపోయి తాత్కాలిక మరణమును పొందెడివారు. ఆ విధముగా వారు ఒక సంవత్సరములో ఆరు నెలలు జీవితమూ, ఆరు నెలలు తాత్కాలిక మరణమునూ పొందెడి వారు. అలా చేయుచూ వారు రెండు వేల సంవత్సరములు బ్రతకగలిగారు. మహా భారతములోని భీష్ముడు కూడా అప్పుడప్పుడు తాత్కాలిక మరణమును ఆశ్రయిస్తూ 380 సంవత్సరములు బ్రతకగలిగాడు. మూడవ మరణమైన

తాత్కాలిక మరణ రహస్యము తెలిసిన కొందరు, రాత్రిపూట శ్వాసను బంధించి మూడవ మరణమును పొంది, తిరిగి పగలు తమ కార్యములను తాము చేసుకొనెడివారు. ఈ విధముగా పూర్వము ఎందరో తాత్కాలిక మరణమును తమకు అనుకూలమైన సమయములో పొందుచూ తమ ఆయుస్సును పెంచుకొని కొన్ని వందలూ, కొన్ని వేల సంవత్సరముల ఆయుస్సును పొంది జీవించగలిగారు.

నేటి కాలములో విజ్ఞానము పెరిగిపోయి, అభౌతిక అజ్ఞానము పెరిగిపోయినది. నేడు భౌతిక జ్ఞానము మాత్రముగల వారికి అభౌతికముతో అనుసంధానమైన అకాల మరణముగానీ, తాత్కాలిక మరణముగానీ తెలియ కుండా పోయినది. నేటి కాలములో యం.బి.బి.యస్ చదివిన వారుగానీ, యం.డి చదివిన డాక్టర్లుగానీ తాము నేర్చుకొన్న విజ్ఞానము వలన భౌతికము గానున్న మరణమునుగానీ, భౌతికముగానున్న జన్మనుగానీ గుర్తించలేక పోవుచున్నారు. మేము ఈ మాటంటే కొందరికి మామీద కోపము రావచ్చును. అట్లు వారు పొరపాటు పడుచున్నారనుటకు ఎన్నో తార్కాణములు గలవు. మా మాట నిజమనుటకు ఒక సంఘటనను వివరిస్తాము చూడండి. 05.03.2011 శనివారము బహుశ టీవీ9 ఛానల్‌లో ఒక వార్తా కథనము వచ్చిందట. మేము ఆ దినము ప్రయాణములో ఉన్నాము కాబట్టి ప్రత్యక్షముగా చూడలేదు. కానీ మా అనుచరులు చూచి చెప్పిన విషయము ఇలా ఉంది. ఒకచోట ప్రమాదము జరిగినపుడు ఒక విద్యార్థిని గాయపడి చావుబ్రతుకుల స్థితిలో ఉన్నపుడు డాక్టరువద్దకు తీసుకపోవడము జరిగింది. అప్పుడు డాక్టరుగారు వైద్యము చేసినా ఆమె బ్రతకలేదు. ప్రమాదస్థితిలో ఉన్న ఆమె చనిపోవడము, వైద్యము అందించినా బ్రతకకపోవడము సహజముగా జరిగేపనే. కావున

ఆమె మరణమును గురించి ఎవరూ ఏమీ అనుకోలేదు. డాక్టరు ఆమె చనిపోయినట్లు ధృవీకరణ పత్రము కూడా ఇచ్చాడట. అప్పుడు ఆ శవమును ఇంటికి తీసుకపోవడమూ, తర్వాత అంత్యక్రియలకు ఏర్పాటు చేసుకొని స్మశానానికి తీసుకపోవడమూ జరిగినది.

స్మశానానికి పోయిన తర్వాత శవమును దించి, చేయవలసిన కార్యములను చేసి చివరకు మృతదేహమును గుంతలో పెట్టు సమయములో అంతవరకు శవమైన ఆమె బ్రతికిలేవడము జరిగినది. అప్పుడు అక్కడున్న వారందరూ ఆశ్చర్యపోయారు. దీనికంతటికీ కారణము ఆమె చనిపోయిందని అబద్ధము చెప్పిన డాక్టరేనని, అతని మీదికి పోయి వాదించారు. ఆ విషయమును వినిన డాక్టరు కూడా ఆశ్చర్యపోయి, ఉన్నదున్నట్లుగా చెప్పాడట. "ఆమెకు వైద్యము చేసినా ఆమె బ్రతకలేదు. నేను చదివిన వైద్యశాస్త్రము ప్రకారము నిజముగా ఆమె చనిపోయింది. అన్ని పరీక్షలు చేసి 20 నిమిషముల తర్వాతనే నేను ఆమె చనిపోయినట్లు నిర్ధారించాను తర్వాతనే మీకు చనిపోయిందని చెప్పాను." ఇందులో నా పొరపాటుగానీ ఏమీలేదు. ఆమె అప్పుడు చనిపోయింది, ఇప్పుడు బ్రతికింది. ఈ విషయము దేవునికి తప్ప ఎవరికీ తెలియదన్నాడట. ఇది నిన్ననే టీవీలో వచ్చిన తాజా సమాచారముకాగా, ఈ మధ్యనే జరిగిన తాజా సమాచారము మరొకటి మాకు తెలిసింది. అది ఏమనగా!

అనంతపురము జిల్లాలోని ఒక పల్లెటూరులో ఒక బీదకుటుంబము ఉన్నది. ఆ కుటుంబములో కుంటికాలున్న ఆడపిల్ల ఉండేది. ఆమె అనారోగ్యముతో చనిపోవడము జరిగినది. పెళ్ళికాని పిల్ల అయిన దాని వలనా, అందులోనూ వారు బీదవారైన దానివలనా, ఆ శవాన్ని పాడెకట్టి

మోసుకపోయే దానికి కూడా స్థోమత లేని దానివలనా చివరికి తండ్రి, కొడుకు ఇద్దరూ స్మశానానికి ఆ శవాన్ని భుజము మీద వేసుకొని పోయారు. అలా భుజము మీద తీసుకపోయిన ఆమె శవాన్ని క్రిందపడుకొబెట్టి ఒకరు గుంతలోనికి దిగి ఒకరు పైనవుండి శవాన్ని గుంతలోనికి దించాలను కొన్నారు. పడుకోబెట్టిన శవమును పట్టుకొని పైకి ఎత్తగానే, ఆ శవము సజీవమై బ్రతికిందట. అప్పుడు వారు త్రవ్విన గుంతను ఖాళీగా పూడ్చ కూడదని ఒక కోడిని చంపి ఆ గుంతలో వేసి పూడ్చిపెట్టారు. తమ బిడ్డ బ్రతికిన విషయము ఆ తండ్రిగానీ, అన్నగానీ ఎక్కడా ఎవరికీ చెప్పలేదు. ఈ విధముగా బయటికి తెలియని సంఘటనలు కూడా ఎన్నో కలవని తెలియుచున్నది.

మనము తెలుసుకోదగిన ఇంకొక ముఖ్యమైన విషయమేమనగా! తాత్కాలిక మరణమును గురించి ఏమాత్రము తెలియని అజ్ఞానులు సహితము తాత్కాలిక మరణమును పొందుచున్నారు. మూడవ మరణమును గురించి ఏమాత్రము తెలియని వ్యక్తులు వారి కర్మానుసారమే మూడవ మరణమును పొందినా, అటు అది వారికీ తెలియదు, ఇటు మనకీ తెలియదు. గత కాలములో అకాల మరణమును పొందిన వ్యక్తులు సూక్ష్మశరీరములో ఉండి, స్థూల శరీరముతో బ్రతికియున్న వారిలోనికి చేరి, వారి శ్వాసను లోపలే బంధించి బయటవారు చూచుటకు చనిపోయినట్లు భ్రమింప చేయుచున్నారు. శ్వాస ముక్కురంధ్రములలో లేనంత మాత్రముననే చని పోయాడని నిర్ణయించు మనుషులు వానిని పూడ్చిపెట్టుచున్నారు. నిజానికి వాని శ్వాస శరీరములోనే ఉండుట ఎవరికీ తెలియదు. సూక్ష్మశరీరములు (దయ్యాలు) కూడా ఈ విధముగ ఇతరుల శరీరములోని శ్వాసను కదలకుండా లోపలే ఉండునట్లు చేసి, బ్రతికిన వానిని చనిపోయినట్లు

చూపించుచున్నవి. సూక్ష్మములు ఈ విధముగా మనుషులను అక్కడక్కడ తాత్కాలికి మరణములోనికి పంపి, వారే చనిపోయినట్లు చూపుట వలన మనము భ్రమించి వాస్తవమును తెలుసుకోలేక పోవుచున్నాము. భూమిమీద దయ్యములు కూడా ఇటువంటి పనిని చేయుచున్నవని ఎవరికీ తెలియదు.

ఈ జనన మరణ విషయములలో భౌతిక శాస్త్రవేత్తలు కూడ పొరపాటు పడుచున్నారు. కావున జనన, మరణముల విషయములను తెల్పుటకు 1980వ సంవత్సరములో మేము **"జనన మరణ సిద్ధాంతము"** అను గ్రంథమును వ్రాశాము. ఇప్పుడు మూడవ మరణమైన తాత్కాలిక మరణమును గురించి తెలుపు నిమిత్తము **"మరణ రహస్యము"** అను ఈ చిన్న గ్రంథమును వ్రాయడము జరిగినది. మేము చెప్పునవన్నీ సంచలనాత్మక విషయములేనని చెప్పుటకు ఈ గ్రంథము తార్కాణముగా నిలువగలదని తెలుపుచూ ఇంతటితో ముగిస్తున్నాము.

| | |
|---|---|
| **శిశువు లోనికి శ్వాస రాకనే చనిపోయాడనడము** | **అజ్ఞానముకాక** |
| **మనిషి బయటికి శ్వాస పోకనే చనిపోయాడనడము** | **విజ్ఞానమగునా?** |



**ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, అట్లే ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరమగును.**



**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.**

# హిందూ రక్షణా! హిందూ భక్షణా!!

## 'భగవద్గీత'యే చదవనివాడు హిందూ రక్షకుడా?

## హిందూ ధర్మమే తెలియనివారు హిందూ రక్షకులా?

హిందువులు నేడు కులాలుగా చీల్చబడి, అందులో హెచ్చుతగ్గు కులములుగా వర్ణించబడియున్నారు అనుట అందరికీ తెలిసిన సత్యమే. దేవుడు మనుషులందరినీ సమానముగా పుట్టించితే, కొందరు మనుషులు తమ స్వార్థ బుద్ధితో హిందూ (ఇందూ) సమాజమును ముక్కలు ముక్కలుగా చీల్చి బలహీనపరచి హిందూసమాజమునకంతటికీ తామే గొప్పవారమనీ, తాము చెప్పినట్లే అందరూ విని అన్ని కార్యములు చేసుకోవాలని ప్రచారము చేసుకొన్నారు. ఎన్నో కులములుగా యున్న హిందూ సమాజములో తమ కులమే అగ్రకులమని చెప్పుకోవడమే కాకుండా, ఇతర కులముల వారందరికీ తామే మార్గదర్శకులమనీ, గురువులమనీ ప్రకటించుకొన్నారు. భవిష్యత్తులో తమకు ఎవరూ అడ్డురాకుండునట్లు, అన్ని కులములను అంటరాని కులములను చేసి, హిందూ సమాజమునకు తీరని అన్యాయము చేశారు. అంతటితో ఆగక నేటికినీ హిందూ సమాజ రక్షకులుగా చెప్పుకొనుచూ, హిందూ సమాజమును సర్వనాశనము చేయుచూ, హిందూ సమాజము ఇతర మతములుగా మారిపోవుటకు మొదటి కారకులగుచున్నారు. అటువంటివారు హిందూ సమాజమునకు చీడ పురుగులుగాయున్నా, మిగతా కులముల వారందరూ వారి నిజ స్వరూపమును తెలియక, వారు చెప్పినట్లే వినుట వలన హిందూ సమాజమును పూర్తిగా అజ్ఞాన దిశవైపుకు, అధర్మ మార్గమువైపుకు మళ్ళించి, ప్రజలకు ఏమాత్రము దైవజ్ఞానమును తెలియకుండా చేసి, తాము చెప్పునదే దైవబోధయని నమ్మించారు.

అటువంటి స్థితిలో నేడు త్రైతసిద్ధాంతకర్తగా శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులవారు అజ్ఞాన దిశవైపు నిలిచి పోయిన హిందూసమాజమును సరియైన దారిలో పెట్టుటకు, భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమను అధ్యాయమున బోధింపబడిన **క్షర, అక్షర, పురుషోత్తమ** అను ముగ్గురు పురుషుల సమాచారమును **"త్రైత సిద్ధాంతము"** అను పేరుతో ప్రతిపాదించి దైవజ్ఞానమును అందరికీ అర్థమగులాగున గ్రంథరూపములో వ్రాయడము, బోధించడము జరుగుచున్నది. దానివలన **నేడు ప్రజలు అసలైన జ్ఞానము తెలియుచున్నదని సంతోషపడుచున్నారు.** అగ్రకులముగా నున్న వారిలో కూడా ఎందరో తమ అజ్ఞాన చీకటులను వదలి, ఇంతవరకూ తమకు తెలియని జ్ఞానము యోగీశ్వరుల ద్వారా ఇప్పుడు తెలియుచున్నదని సంతోషపడి శిష్యులుగా చేరిపోవుచున్నారు. అయితే అగ్రకులములో కొందరు మాత్రము యోగీశ్వరులు తెలియజేయు జ్ఞాన విషయములను చూచి ఈ జ్ఞానము వలన **ప్రజలు జ్ఞానములో చైతన్యులై,** జ్ఞానము తెలియని తమను గౌరవించరని భావించి, దానివలన సమాజము మీద తమ ఆధిపత్యము లేకుండా పోవునని తలచి, యోగీశ్వరులు తెలుపుచున్న త్రైత సిద్ధాంతము గానీ, త్రైత సిద్ధాంత భగవద్గీతగానీ హిందువుల జ్ఞానమే కాదనీ, అది క్రైస్థవ మతమునకు సంబంధించినదనీ, దానిని ఎవరూ చదవకూడదనీ ప్రచారము చేయను మొదలుపెట్టారు. అంతేకాక తాము హిందూ ధర్మ రక్షకులమని, కొంత రాజకీయరంగు పూసుకొని, మా జ్ఞాన ప్రచారము నకు అక్కడక్కడ అడ్డుపడడము జరుగుచున్నది. తమ మాట విను ఇతర కులముల వారికి కూడా ప్రబోధానందయోగీశ్వరులు చెప్పు జ్ఞానము హిందూ జ్ఞానము కాదు, క్రైస్థవుల జ్ఞానమనీ హిందువుల ముసుగులో క్రైస్థవ మత ప్రచారము చేయుచున్నారని చెప్పడమేకాక, అటువంటివారిని ప్రేరేపించి మా ప్రచారమునకు అడ్డు తగులునట్లు చేయుచున్నారు.

యోగీశ్వరుల వారు నెలకొల్పిన హిందూ (ఇందూ) జ్ఞాన వేదిక ఇటువంటి ఆగడాలను కొంతకాలముగా ఓర్పుతో చూడడము జరిగినది. మాలో ఓర్పు నశించి, మమ్ములను అన్యమత ప్రచారకులుగా వర్ణించి చెప్పు అగ్రకులము వారిని, వారి అనుచరులను మేము ఎదురుదిరిగి ప్రశ్నించడము జరిగినది. మేము ప్రశ్నించిన ఒక్క ప్రశ్నకు కూడా వారు సరియైన సమాధానము ఇవ్వలేదు. ఆ జవాబులు ఎలా ఉన్నాయో పాఠకులుగా మీరే చూడండి.

**మా ప్రశ్న :-** ఇంతవరకు ఏ హిందువూ చేయని విధముగా ఊరూరు తిరిగి, ఊరులో ఇల్లిల్లూ తిరిగి హిందూ ధర్మములను ప్రచారము చేయుచున్నాము కదా! అటువంటి మమ్ములను మీరు అన్యమత ప్రచారకులుగా ఎందుకు చెప్పుచున్నారు?

**వారి జవాబు :-** హిందూమతములో ఎందరో స్వామీజీలు ఉన్నారు. వారు ఎవరూ ఇల్లిల్లూ తిరిగి ప్రచారము చేయలేదు. హిందువులు అట్లు ఎవరూ ప్రచారము చేయరు. క్రైస్థవులయితేనే బజారు బజారు, ఇల్లిల్లూ తిరిగి ప్రచారము చేస్తారు. మీరు హిందువుల ముసుగులో ఇల్లిల్లూ తిరిగి క్రైస్థవమును ప్రచారము చేయుచున్నారు.

**మా ప్రశ్న :-** మేము క్రైస్థవులమయితే భగవద్గీతను ఎందుకు ప్రచారము చేస్తాము?

**వారి జవాబు :-** మీరు ప్రచారము చేయునది 'త్రైత సిద్ధాంత భగవద్గీత'. అది క్రైస్థవులది. బైబిలుకే మీరు అలా పేరు పెట్టారు.

**మా ప్రశ్న :-** క్రైస్థవులు తమను క్రైస్థవులుగానే చెప్పుకుంటారు. అలాగే బైబిలును బైబిలుగానే చెప్పుకొంటారు. వారి ప్రచారము క్రైస్థవము, బైబిలు

అయినప్పుడు అదే పేరుమీద ప్రచారము చేస్తారు తప్ప, హిందువులుగా భగవద్గీత పేరుతో ఎందుకు ప్రచారము చేస్తారు? ఇంతవరకు అట్లు ఎక్కడా జరుగలేదు. ఏ మతమువారు ఆ మతము పేరు చెప్పుకొంటారు గానీ ఇతర మతము పేరు చెప్పరు. అంతెందుకు మీరు మా భగవద్గీతను తెరచి చూచారా? అందులో భగవద్గీత శ్లోకములున్నాయా? బైబిలు వాక్యము లున్నాయా?

**వారి జవాబు :-** త్రైత సిద్ధాంతమని యున్నది కదా! త్రైతము అంటే త్రిత్వము అని త్రినిటి అని మాకు బాగా తెలుసు.

**మా ప్రశ్న :-** హిందూ ధర్మములలో అద్వైత సిద్ధాంతమును ఆదిశంకరా చార్యుడు ప్రతిపాదించాడు. విశిష్టాద్వైతమును రామానుజాచార్యులు ప్రతిపాదించాడు, ద్వైతమును మధ్వాచార్యులు ప్రకటించాడు. ఇప్పుడు శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు **'త్రైత సిద్ధాంతము'**ను ప్రతి పాదించాడు. సిద్ధాంతకర్తలు, సిద్ధాంతములు వేరయినా అందరూ హిందువు లని మీరు ఎందుకు అనుకోలేదు?

**వారి జవాబు :-** మీ త్రైతసిద్ధాంత భగవద్గీతలో యజ్ఞములను చేయకూడదని వ్రాశారు కదా! నిజముగా భగవద్గీతలో అలా లేదు కదా!

**మా ప్రశ్న :-** మీరు హిందువులలో ముఖ్యులుగా వుండి అంత మూర్ఖముగా మాట్లాడితే ఎలా? **ప్రపంచమునకంతటికీ ఒకే భగవద్గీత** యుంటుంది గానీ, మీ భగవద్గీత, మా భగవద్గీతయని వేరుగా ఉండదు. భగవద్గీతకు వివరము ఒక్కొక్కరు ఒక్కొక్క విధముగా వారికి అర్థమయినట్లు చెప్పియుండవచ్చును గానీ, అందరికీ భగవద్గీత మూల గ్రంథమొక్కటేనని గుర్తుంచుకోండి. **త్రైత సిద్ధాంత భగవద్గీత అన్నిటికంటే సరియైన భావముతో యున్నదనీ,** చదివిన

జ్ఞానులందరూ పొగడుచూయుంటే, మీ కులములో ఎందరో ప్రశంసించు చూయుంటే, మీకు కొందరికి మాత్రము వ్యతిరేఖముగా కనిపించిందనడము అసూయతోనే అని మాకు అర్థమగుచున్నది. యజ్ఞములు చేయవద్దని మేము ఎక్కడా చెప్పలేదు. యజ్ఞముల వలన పుణ్యము వస్తుంది, స్వర్గము వస్తుంది అని చెప్పాము. యజ్ఞముల వలన మోక్షము రాదు, దేవుడు తెలియడని చెప్పాము. అంతెందుకు మీరు మేము అన్ని కులములకంటే స్వచ్ఛమయిన హిందువులమని చెప్పుకొంటున్నారు కదా! భగవద్గీతలో చెప్పిన **ఒక్క** హిందూ ధర్మమును చెప్పండి.

**వారి జవాబు :-** అవన్నీ మాటలు వద్దు... మీరు హిందువులు కాదు.

**మా ప్రశ్న :-** మొండిగా మాట్లాడవద్దండి. మీరు అగ్రకులము వారమని ఇష్టమొచ్చినట్లు మాట్లాడకండి. మేము హిందువులము కాము అనుటకు ఆధారము ఏమైనా చూపగలరా? మా కథ అట్లుంచి మీరు సరియైన హిందువులే అయితే భగవద్గీతలో విశ్వరూప సందర్శనయోగమను అధ్యాయములో **48వ శ్లోకములోనూ, 53వ శ్లోకములోనూ** భగవంతుడు ఏమి చెప్పాడో మీరే చెప్పండి.

**వారి జవాబు :-** మేము ఇంతవరకు భగవద్గీత చదువలేదు. మీకు కావలసి వస్తే సంపూర్ణానందస్వామితో చెప్పిస్తాము.

**మా ప్రశ్న :-** కనీసము భగవద్గీతను కూడా చదువని మీరు యోగీశ్వరులయిన ప్రబోధానందస్వామిని దూషించడము మంచిదా? ఒక్క హిందూ ధర్మమును కూడా తెలియని మీరు హిందూ ధర్మ రక్షకులమని చెప్పడము మంచిదా? యోగీశ్వరుల వారు వ్రాసిన ఒక్క గ్రంథము కూడా చదువకుండా మేము తప్ప పూజ్యులుగా, గురువులుగా ఎవరూ ఉండకూడదను అసూయతో ఇలాగ మాట్లాడితే దేవుడు ఓర్చుకోడని చెప్పుచున్నాము.

**వారి జవాబు :-** హిందూ మతములో ఎందరో దేవుళ్ళున్నారు. శివుడు దేవుడే, శివుని కొడుకు గణపతి దేవుడే, రాముడు దేవుడే, రాముని సేవకుడు ఆంజనేయుడు దేవుడే. అలాంటి హిందూ మతములో 'దేవుడు ఒక్కడే' అని చెప్పడము మీది తప్పు కాదా?

**మా మాట :-** మేము మతమును గురించి చెప్పలేదు. హిందూ మతములో ఎందరో దేవుళ్ళుండడము నిజమే, అయితే హిందూ జ్ఞానములో, హిందూ ధర్మము ప్రకారము **విశ్వమునకంతటికీ ఒకే దేవుడని** చెప్పాము. భగవద్గీతలో దేవుడు చెప్పినదే చెప్పాము తప్ప మేము దేవతలను గురించి లేరని చెప్పలేదే! దేవతలకందరికీ అధిపతియైన దేవుడు ఒక్కడున్నాడని, ఆయనే దేవదేవుడనీ, అతనిని ఆరాధించమని చెప్పాము.

**వారి జవాబు :-** మీరు రాముని పేరు చెప్పరు, శివుని పేరు చెప్పరు, వినాయకుని పేరు చెప్పరు. ఎవరి పేరూ చెప్పకుండా దేవుడు అనీ, 'సృష్ఠికర్త'యనీ అనేకమార్లు పేర్కొన్నారు. 'దేవుడు' అను పదమునుగానీ, 'సృష్ఠికర్త' యను పదమునుగానీ క్రైస్థవులే వాడుతారు. హిందువులు వాడరు. అందువలన మిమ్ములను హిందువులు కాదు క్రైస్థవులు అంటున్నాము.

**మా ప్రశ్న :-** క్రైస్థవ మతము పుట్టి రెండువేల సంవత్సరములయినది. సృష్ఠిపుట్టి ఎన్ని కోట్ల సంవత్సరములయినదో ఎవరూ చెప్పలేరు. సృష్ట్యాది నుండి **'సృష్ఠికర్త'** అను పదమును **'దేవుడు'** అను పదమును హిందూ సమాజము వాడుతూనే యున్నది. మొదటి నుండి హిందూసమాజములో యున్న దేవుడు, సృష్ఠికర్త అను పేర్లను హిందువులు క్రైస్తవులకేమయినా లీజుకిచ్చారా? లేక పూర్తిగా వారికే అమ్మేశారా? అని అడుగుచున్నాము. సృష్ఠికర్త అనిగానీ, దేవుడు అనిగానీ హిందువులయినవారు అనకూడదని ఎక్కడయినా ఉన్నదా అని అడుగుచున్నాము?

**వారి జవాబు :–** మీరు హిందూమతమును కాకుండా అన్యమతమును బోధించుచున్నారనుటకు, మిమ్ములను మీరు హిందువులుగా చెప్పుకోలేదు. హిందువులుగా కాకుండా ఇందువులుగా చెప్పుకొంటున్నారు. అటువంటప్పుడు మీరు హిందూమతమును చీల్చినట్లు కాదా! ప్రత్యేకించి 'ఇందూ మతము' అను దానిని ప్రచారము చేసినట్లు కాదా! మీరు హిందువులే అయినప్పుడు మీ గ్రంథములలోగానీ, మీ బోధలలో గానీ ప్రత్యేకించి 'ఇందువులు' అని ఎందుకు చెప్పుచున్నారు?

**మా మాట :–** మేము సూటిగా ఒక ప్రశ్నను అడుగుతాము జవాబు చెప్పండి. **'హిందువు, ఇందువు'** అను పదములో కొద్దిపాటి శబ్దము తప్ప ఏమి తేడాయుందో మీరే చెప్పండి. తెలుగు భాషను వ్రాసే వారందరూ హిరణ్యకశ్యపున్ని చంపినది నరశింహస్వామి అని చెప్పుచుందురు, అలాగే వ్రాయుచుందురు. ప్రస్తుత కాలములో నరశింహులు అని పేరున్నవాడు కూడా వాని పేరును నరశింహులు అని వ్రాయడము అందరికీ తెలుసు. అయితే ఆ మాట తప్పు అలా వ్రాయకూడదు దానిని **నరసింహ** అని వ్రాయవలెను అని చెప్పుచున్నాము. అడవిలో మృగరాజును **సింహము** అని అంటాము తప్ప **శింహము** అని అనము అని కూడా చెప్పుచున్నాము. 'సింహము' అంటే అర్థమున్నది గానీ, 'శింహము' అంటే అర్థము లేదు అని కూడా చెప్పాము. అలా ఉన్నది ఉన్నట్లు చెప్పితే **'ఇందువు'** అనే దానికి అర్థమున్నదిగానీ **'హిందువు'** అనే దానికి అర్థములేదు అని చెప్పాము. సృష్ట్యాదిలో పుట్టినది ఇందూ సమాజమనీ, అది మధ్యలో పేరుమారి దృష్ఠి జిష్ఠి అయినట్లు, 'ఇందూ' అను శబ్ధము 'హిందూ' అని పలుకబడుచున్నదని చెప్పాము. 'ఇందూ' పదము ఎందుకు వాడాలి, 'హిందూ' పదమును ఎందుకు వాడకూడదని కూడా వివరముగా మా గ్రంథములలో గలదు.

ఉన్న **సత్యము** మీకు తెలిసినా, మీరు మాకంటే పెద్ద ఎవరూ ఉండకూడదను అసూయతో మాట్లాడుచున్నారు.

అగ్రకులములో ఎందరో పెద్దలు మా జ్ఞానమును తెలిసి సంతోషించుచుండగా, కొందరు మాత్రము వీధి రౌడీలలాగా తంతాము, పొడుస్తాము, కాలుస్తాము మీరు ప్రచారము చేయవద్దండని చెప్పడము మంచిది కాదు. మా గ్రంథములు ఏదీ చదువకుండా మాట్లాడడమూ, మేము చెప్పిన మాటలను వినకుండా ఇవన్నీ డ్రామాలు, నాటకాలు అనడము మంచిది కాదు. మీరు ఎవరైనా మా గ్రంథములలో ఇతర మతములను ప్రచారము చేసినట్లుగానీ, ఫలానా మతములోనికి చేరమని చెప్పినట్లుగానీ ఉంటే నిరూపణ చేయండి, అలా నిరూపించినవారికి ఇందూ జ్ఞానవేదిక తరపున పది లక్షల రూపాయలను ఇవ్వగలము. నిరూపించ లేకపోతే మీరు లక్ష రూపాయలు ఏ ఊరిలోనయినా శ్రీకృష్ణుని గుడికి ఇవ్వవలెను. ఈ షరతుకు ఎవరైనా ముందుకు వస్తారా? అని అడుగుచున్నాము.

ఇట్లు

# ఇందూ జ్ఞానవేదిక

**మనుషుల పుట్టుక యంతా ఒక్కటే**

**మనుషుల మరణము యంతా ఒక్కటే**

**మనుషులకు దేవుని జ్ఞానము ఒక్కటే**

**మనుషులలోనికి మతమెందుకు వచ్చినది**

